మీ పొలాలలో

# ఎక్కువ పంటలు

పండించండి

నానాటికీ పెరిగే దేశావసరా
లకుగాను మరొక 15.5 మిలియన్
టన్నుల ఆహారధాన్యాలు
ద్వితీయ పంచవర్ష ప్రణాళికా కాలంలో
మనం తప్పని సరిగా పండించాలి
ఎరువులు అధికంగా
వినియోగించి, మంచి
రకం విత్తులు నాటి, ఆధునిక
పద్ధతులలో భూసారం
రక్షించుకొంటూ పెద్ద ఎత్తున
సాగు చేయడం వలననే
ఈ అధికోత్పత్తి సాధ్యమవుతుంది

# ప్రణాళిక

పురోగతి

సంపదలకూ, సర్వతోముఖాభివృద్ధికీ—



DA 57/297



వైద్య భాస్కర సారథీన్

# హెయిర్ టానిక్

ఆయుర్వేద పద్ధతులపై తయారు చేయబడిన ఔషధరాజము. కుదుళ్లను గట్టిపఱచి కురులను గుబురుగా పెంచును. అకాలమున నెరవనీయదు; రాలనీయదు. మెదడుకు చలువచేయును.

పెద్ద సీసా రు. 4  చిన్న సీసా రు. 2

**సుందరీశంకరం**

64 A అప్పర్‌స్వామి కోవిలవీధి
మైలాపూర్ — మద్రాసు 4

కడుపునొప్పి, నోట నీరూరుట, త్రేపులు, వాంతులు, మలబద్ధకము లాంటి అజీర్ణ లక్షణములకు

కేసరిగారి

# ఆదిత్య లవణము

దివ్య ఔషధము

వెల రు. 1-75 న.పై.

**కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్**
మద్రాసు 14.

# ఆమె రూపవతి

కాని, గర్భాశయ రోగములు ఆరోగ్యమును క్షీణింపజేయుట వల్ల ఆమె జీవిత సౌఖ్యమును అనుభవించలేక సంతాన సౌభాగ్యమును పొందలేక పోవుచున్నది.






స్త్రీలకు ప్రత్యేకముగ కలిగెడి వ్యాధులన్నిటిని పారద్రోలును
సంతాన సౌభాగ్యమును ప్రసాదించును.

**ఆయుర్వేదాశ్రమం (ప్రైవేట్) లిమిటెడ్, మదరాసు - 17**


గృహలక్ష్మి
స్త్రీల ఆరోగ్య సౌభాగ్యములను
వెంపొందించుట కేర్పడిన
పవిత్ర మాసపత్రిక
ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.
ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య
సంపుటము ౨౭ ] ఏప్రెల్ 1958 [ సంచిక ౪

# విషయసూచిక

—X—



---

## శ్రీమతి యామినీపూర్ణ తిలకమ్మగారి ప్రథమ మృతవార్షిక వర్ధంతి

తాంబరంలో విశ్వకళ్యాణ విజ్ఞాన విహార్ యాజమాన్యమున 16-3 58 నాడు సాయంకాలం 5 గం॥ లకు కీ॥ శే॥ యామినీపూర్ణ తిలకమ్మగారి ప్రథమ మృత వార్షిక వర్ధంతి సమావేశము జరిగెను.

అనివార్య కారణములవలన శ్రీ జి. వి. సుబ్బారావుగారు సమావేశములో పాల్గొనజాలక పోవుటచే శ్రీ దర్శి చెంచయ్యగారు అధ్యక్షత వహించి శ్రీమతి తిలకమ్మగారి దేశభక్తిని, సంఘసేవా తత్పరతను కొనియాడుచూ సంఘ సంస్కరణలపట్ల, స్త్రీల విద్యావ్యాప్తిపట్ల ఆమెకుగల ఆసక్తి, వాని నుద్దేశించి ఆమె సాగించిన ఉద్యమం, ఆ నాటి ధైర్యసాహసాలు, కార్యదీక్ష, సేవాత్యాగాలు జాతీయరంగంలో ముఖ్యంగా మహిళలకు యీ నాడు ఆదర్శప్రాయములైనవనిరి.

గాంధీజీ అడుగుడజాడలలో చిత్తశుద్ధికి, నిరాడంబరమైన సేవాత్యాగములకు ప్రాధాన్యమిస్తూ దేశకళ్యాణమునకుగాను విధ్యుక్తధర్మమును నిర్వహించుటలో జీవితము గడిపిన ధన్యురాలని జోహారు లర్పించిరి

శ్రీమతి మలపాక కమలమ్మగారు, గృహలక్ష్మి సంపాదకులు శ్రీ సి. సి. పున్నయ్యగారు ఉపన్యసించుచు శ్రీమతి తిలకమ్మగారి దీక్షాత్యాగములను ప్రశంసించి నిరాడంబరంగా స్వార్థరహితమైన మానవసేవకు, భగవత్సేవకు తన జీవితమును అంకితముచేసినదనియు, మానవ అభివృద్ధి అభ్యుదయాలకు ఉత్తమ నైతిక స్థాయి అవసరమని ఆరాటపడిన వ్యక్తియనియు వివరించిరి.

శ్రీ టి. యస్. రామచంద్రన్‌గారు ఉపన్యసించిన తరువాత విశ్వకళ్యాణ విజ్ఞాన విహార్ కార్యదర్శిని శ్రీమతి కనకదుర్గా రామచంద్రన్ వందన సమర్పణముచేయుచు, తమ తల్లిగారి ఆదర్శలక్ష్యాల ననుసరించి మానవసేవ చేయదలచి యీ ఆశ్రమంలో నొక హాలు నిర్మించి బాలలకు, స్త్రీలకు విద్యా విజ్ఞానకేంద్రమును నిర్వహించదలచితిననియు, అందుకుగాను అభిమానులు, ఉదారులు సహకరించి సహాయపడవలసినదిగా విజ్ఞప్తి చేసిరి.




జయజయ గృహలక్ష్మీ స్త్రీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# జా తీ యా వ స ర ము లు



స్వతంత్ర భారత దేశములో స్వీయపురోభివృద్ధి నుద్దేశించి స్త్రీలు, పురుషులు కూడ చేయవలసిన కృషి, త్యాగములు అనేకములుగలవు. దానిని విస్మరించి సంకుచిత హృదయముతో మంచిచెడ్డలను విజ్ఞతతో గుర్తించకుండా పరస్పర విమర్శల తోటి, రచ్చలు రాద్ధాంతములతోటి సాంఘిక, రాజకీయరంగములు అల్లకల్లోలముగా నుండుట శోచనీయము.

సంఘంలో పరస్పర సహకార, సద్భావ, విశ్వాసములు మరుగుపడుచుండగా అభివృద్ధి అభ్యుదయాలను మనము సాధిస్తున్నామనుకొనుట పొరబాటు. వాస్తవికత కనుగుణ్యంగా ఉన్నవాడు లేనివానిని సానుభూతితో చూచి కులమత వర్గాలకతీతముగా ప్రతియొక్కరి అభివృద్ధికి తోడ్పడడం యీ నాడత్యవసరం. ఇది ఒక్క ఆర్థికరంగం లోనే కాదు; విద్యా, విజ్ఞాన, సాంఘికరంగాలలో సయితము లేనివారిపట్ల ఉన్నవారి సానుభూతి సహాయములు జాతీయశ్రేయస్సుకు మెరుగుపెట్టగలవు.

సంపన్నులు ఉదారంగా దానధర్మములుచేసి విద్యావ్యాప్తికి, ఆరోగ్య, వైద్య

సౌకర్యాల అభివృద్ధికి తోడ్పడినంత మాత్రముననే అభివృద్ధి అభ్యుదయాలు సమకూరగలవనుకొనుట పొరబాటు. లేదా పూర్తిగా ప్రభుత్వ సహాయ సహకారములు, ప్రోత్సాహముమీద మాత్రము ఆధారపడినను తృప్తికరమైన ఫలితములుండవు.

ప్రజలలో స్వయంకృషి అలవడాలి. చదువుకున్నవారు నిరక్షరాస్యులకు విద్యగరపుటకు నడుంకట్టాలి, పతనావస్థలలోనున్న సాంఘికవ్యవస్థను ఉద్ధరించుటకు నిరంతరము కృషిచేయాలి.

ఆర్థికరాజకీయరంగాలలోను, సాంఘికరంగములోను ఆధికార, ఆధిపత్యవాంఛలకే ప్రాముఖ్యమివ్వకుండా ప్రతియొక్కరు శక్తిసామర్థ్యములను, బుద్ధిబలమును వినియోగించి న్యాయంగా, ధర్మంగా నలుగురితోబాటు గౌరవముగా హక్కులు అవకాశములను వినియోగించి, జీవయాత్ర చేయుటకు అవకాశములు విస్తృతమగుటకు ప్రతియొక్కరు ఆసక్తిచూపాలి.

ఈనాటి పరిస్థితులను ఆనాడే గాంధీజీ దృష్టిలోనుంచుకొని గాంధీజీ జాతీయ శ్రేయస్సునుద్దేశించి విద్యాధికులైనస్త్రీలు, పురుషులు తమ సేవాకార్యక్రమాలను గ్రామసీమలలో నిర్వహించాలన్నారు. గ్రామాలలో నిరక్షరాస్యతను, అజ్ఞానమూఢవిశ్వాసములను రూపుమాపి, ప్రజలలో విద్య విజ్ఞానముల వ్యాప్తినొందించి, ప్రజలలో సద్భాత, సానుభూతి, సహాయసహకారముల పెంపుకు విద్యాధికులెంతైనా తోడ్పడగలరు. సంపన్నులు ప్రజాశ్రేయస్సు నుద్దేశించి ధనము వెచ్చించకలిగినచో అట్టిఅవకాశములేని విద్యాధికులు నిరక్షరాస్యులకు విద్యావిజ్ఞానముల గరపనగును.

ముఖ్యంగా మహిళాసంఘాలు తమ కార్యకలాపములను క్లబ్బులుగా పట్నములకు మాత్రము పరితముచేయకుండా గ్రామసీమలకు విస్తరింపజేయాలి. విద్యావిజ్ఞానములకు దూరమై, అనారోగ్యంతో, ఆర్థికదుస్థితితో అలమటిస్తున్న మహిళలను, వారి ననుసరించియుండు సంసారములను తమ సేవాకార్యక్రమముతో మహిళాసంఘాలు, అందలి సేవికలు ఎంతైనా ఉద్ధరించనగును.

ప్రభుత్వ ధనవ్యయంతో సయితం తృప్తికరంగా సాధించజాలని సంక్షేమాన్ని సేవాసంఘాలద్వారా విద్యాధికులైన స్త్రీ, పురుషులు సాధించుట సులభము.

ప్రతియొక్కరు దేశక్షేమం గ్రామసీమల పురోభివృద్ధిపై నాధారపడియున్నదనియు, అందుకుగాను గ్రామీణప్రజల సౌభాగ్యమునకు యితరప్రజానీకం ఎంత తోడ్పడితే అంతమంచిదనియు, మధ్యతరగతి కుటుంబాలు ఉట్టికి స్వర్గానికెక్కకుండా పతనం చెందుటకంటె కుటుంబ ఆదాయం పెంపుకు, ఆదాయమును క్రమమార్గాలలో సద్వినియోగం చేసికొనుటకు ప్రజాహితవాదులు, సంఘాలు నిర్విరామంగా తోడ్పడాలి.

# బిడ్డలు - తల్లిదండ్రులు

—(౦)—

## నిర్మాణాత్మక క్రమ శిక్షణ

శ్రీ కె. వెంకట్రామయ్య

(గత సంచిక తరువాయి)

క్లిష్ట సమస్యలను కలిగింపగల పరిస్థితులను ఏర్పడకుండ జూచుకొనెడి విధానము.

పెద్దలు తెలియక తెచ్చిపెట్టెడి పరిస్థితులవలననే పిల్లలు వారిని బాధించుటయు, ఎదురించుటయు జరుగుచుండును. అట్టి పరిస్థితుల నెదుర్కొనుట యెట్లో సమగ్రముగా జెప్పుట కష్టముఐనను వానివలన గలుగగల సమస్యల సంఖ్యను కొంతవరకు తగ్గించుటకు తోడ్పడెడి కొన్ని సూచనలను మాత్రమిట చేయనగును.

1. అల్లరిపనికి దిగనున్న చిన్న పిల్లల దృష్టిని మరియొక మంచి వ్యాపకముపైకి మరల్ప ప్రయత్నింపవలెను.

2. బిడ్డల యవధానమును పొందక ఆజ్ఞల నీయరాదు. బిడ్డలు తమ్మాలకించుచున్నదియు, లేనిదియు విచారింపక పెద్దలు వారి నేదో చేయమనుటయు దానిని వారు చేయకున్నచో తమ్మెదిరించిరని తన్నుటయు సామాన్యముగా జరుగుచుండును. ఆటలో నిమగ్నుడై యున్న బిడ్డ ఏదో చేయుమని చెప్పినపుడు ఏమియు వినకుండియు "అలాగే" యని తలయూచగలడు.

3. బిడ్డ పనిగా నున్నప్పుడు అనవసరముగా నడ్డుపోరాదు. మన మొక పనిలో నిమగ్నులమై యున్నపుడు ఎవరో మన పని కడ్డువచ్చి ఆ పనిని తక్షణమే వదలి మరియొక పనిని చేయుమన్నారనుకొనుడు. అప్పుడు మనకెంత బాధగా నుండును. ఐనను మనము పిల్లలేదో పనిలో నున్నప్పుడు ఏమియు విచారింపక వారి నా పనిని తక్షణమే వదలి మరియొక పనిని చేయమనుచుందుము. అట్టియెడ వారిని మన మెంతో బాధించినవారమే యగుదుము. అప్పుడు వారు మనల నెదిరించిన ఆశ్చర్యమేమి? బిడ్డ పనిలో నిమగ్నుడై యున్న సమయమున మన మతని నెక్కడికైనను పంపదలచితి మనుకొనుడు. లేదా భోజనమునకు పిలువదలచితిమనుకొనుడు. అందులకై అతనిని తక్షణమే ఆ పనినుండి లేచిరమ్మనక ఐదు నిమిషములలో అతడు రావలసియుండునని ముందుగా హెచ్చరించవలెను. ఆ హెచ్చరించుట మాటల మూలకముగనో, గంట వాయించుట, తదితర చిహ్నముల జూపుట ద్వారానో కావచ్చును. అతి చిన్న పిల్లల విషయములో నా హెచ్చరించుట ఆటతో జతపరచినది కావచ్చును. మోటారుకారుతో బిడ్డ ఆడుకొనుచున్నాడనుకొనుడు. అప్పుడు "కారును షెడ్డులో నుంచుటకు టైమైనది. కారు డ్రైవరు భోజనమునకు రావలె"నని మన మన్నచో బిడ్డ తొందరగా ఆటను ముగించుకొని భోజనమునకు రాగలడు. అతని పని కడ్డుపోరాదనెడి సంగతిని గుర్తించుచు వ్యవహరింతుమేని అతడును మన మడిగెడి పనులు న్యాయములైనవే యగునని తలంచుచు వానిని చేయ నిరాకరింపకుండును.

4. ఆజ్ఞాపించుటకంటె వినయముతో నడుగుటయే మంచిది. ఆజ్ఞలు అధికార సూచకములు. అందుచే ఆజ్ఞలయెడ బిడ్డ అయిష్టతను, కోపమును జూపగలడు. బిడ్డలతో నెల్లప్పుడు మర్యాదగా వ్యవహరించుటచే వారును మర్యాదగా నుండుటనే నేర్చుకొందురు. మర్యాదగా నుండుడని వారి నాజ్ఞాపించుటకంటె మనమే అట్లుండి చూపుట ఉత్తమమైనపని.

**5.** నిందించుటకంటె, మెచ్చుకొనుటయే మంచి ప్రవర్తనకు ప్రేరణకావలెను. బిడ్డ చెడ్డ ప్రవర్తననే, మన మెక్కువగా గమనించి విమర్శింతుము. మంచి ప్రవర్తనను గమనించక ఊరకుందుము. పిల్లవాని ప్రతి చిన్న తప్పునుగూర్చియు చర్చించుచుంటిమేని అతని మంచితనమును మెచ్చుకొనుటకు అవకాశమే చిక్కదు. అందువలన అతని మంచితనమే కనుపింపక మరుగుపడును. దండన లధికమగుకొలది వాని ప్రయోజకత తగ్గిపోవును. చీటికిమాటికి చీవాట్లు పెట్టుటచే అవియును నిష్ప్రయోజకములే యగును. తానేది చేసినను తప్పేయగుట తథ్యమనియు, పెద్ద లున్నది తన్నిష్ట ప్రకారము ఉండనీయకుండుటకును తన్నపార్థముచేసికొనుటకును, నిందించుటకును, దండించుటకును మాత్రమే యనియు బిడ్డ భావించును.

6. బిడ్డ ఏ వయస్సున ఎట్టి యభివృద్ధిని జూపునదియు ఎరిగియుండుట అవసరము. లేనిచో మన మతనిని, వయస్సునకు మించిన పనులను చేయగోరవచ్చును. మూడేండ్ల బిడ్డ వస్తువులను పగులగొట్టెడి గుణమును చూపును. సులభముగా పగిలెడి, లేదా విరిగెడి వస్తువుల నాతని కిచ్చినచో అవి త్వరగా అతని చేతులలో విరుగుటయు పగులుటయు తథ్యము. కారణమేమన ఆ యీడు బిడ్డకు వస్తువులను క్రింద వేసికొట్టుట, పడద్రోయుట, లాగుట మున్నగు విధములుగా ఆడుటయే ఇష్టమైయుండును. వస్తువులను నిర్మించుట, తయారుచేయుట అతని కింకను తెలియదు. అందుచే వస్తువులకు మన మిచ్చెడి విలువ అతనికి అర్థముకాదు. మూడేండ్ల వయస్సున నిర్మూలన సహజత మెక్కువగా పనిచేయుచుండును. కనుక బిడ్డ కిచ్చెడి యాటవస్తువులు సులభముగా పగులునవియు, విరుగునవియు కారాదు. బిడ్డకైదేండ్లు వచ్చినను నాశన గుణమునే చూపుచుండిన యెడల అట్టి వెనుకబాటి ప్రవర్తనకు కారణమేదో కనుగొనవలెను. అది నిర్వాహణలోపముచేతనే కావచ్చును.

7. మన ప్రవర్తన విరుద్ధముగాక, ఏకరీతిగ నుండవలెను. మన ప్రవర్తన విరుద్ధమై ఏకరీతిగ లేనప్పుడు బిడ్డకు ఏమిచేయవలెనో, ఏమిచేయరాదో, మనమేమి చేయగోరుచున్నామో నిశ్చయముగా తెలియకుండును. అందుచే అతడెంతో బాధపడగలడు. అవిధేయత జూపుచు బాధింపగలడు. పెద్దల విరుద్ధ ప్రవర్తనలచే పిల్లలకు తప్పొప్పులగూర్చి కచ్చితముగా నేమియు తెలియకుండును. మరియు పెద్దలకే ఆ తప్పొప్పులగూర్చి నిశ్చితాభిప్రాయములు లేవనియు, అవి దినదినమును మారుచుండుననియు వారనుకొనగలరు.

8. మనము చెప్పిన దానిని బిడ్డ చేయుననెడి నిశ్చయభావముతోనే చరింపవలెను. అతని యవిధేయతనే ఎదురుజూచుచుంటిమని బిడ్డకు మాటవలనగాని, చర్యవలనగాని సూచింపరాదు. సూచించినచో అతడు తప్పక అవిధేయతను చూపును. అనుకొన్నదానికన్న ఎక్కువగనే చూపగలడు !

9. ఏపనినైనను అతడేల చేయవలెనో బిడ్డకు సహేతుకముగా నెరుకపరచవలెను, సహేతుకముగ ప్రవర్తించెడి వ్యక్తిగా అతడభివృద్ధిగాంచవలెననిన హేతువు నర్థము జేసికొనగల శక్తియు, హేతుభూతముగ చరింపగల శక్తియు అతనికి కలవనియే భావించి అతనితో వ్యవహరించుట మంచిది. అతనిని వాదమునకు మాత్రము ప్రోత్సహింపరాదు. అతనిని ఒక పనిని చేయుమని చెప్పితిమనుకొనుడు. దానినేల చేయవలెనోగూడ అతనికి అర్థమగు రీతిని తెలియజేసితిమనుకొనుడు. ఇంకను అతడేల చేయవలెనని చిరాకుగొలిపెడి రీతిని రెట్టించి యడుగుచుండిన యెడల కారణమేమగును ? చేయుట కిష్టములేకుండుటయేగదా ! పిల్లలేపనినైనను తక్షణమే చేయక తప్పించుకొనదలచినను, ఆలస్యముగా చేయదలచినను అట్లే అడుగుచుందురు. అప్పుడు మనము వారితో వాదింపక తక్షణమే చెప్పినట్లు చేయవలసినదిగా ఆజ్ఞాపించవలెను. వాదనకొరకే వాదించుట పనికిరాదు. అట్లు వాదించుటకు ప్రోత్సహింపరాదు. ఒక పనిని ఏలచేయవలెనో తెలిసికొనుటకై బిడ్డ తర్కించుచున్నాడా ? లేక పనిఉండినప్పటికి తప్పిం

చుకొని కాలవిలంబనము చేయుటకై వాదించు చున్నాడా యనెడి విషయమును సరిగా విచక్షణచేసి తెలిసికొనవలెను.

10. తల్లిదండ్రు లిరువురును ఐక్యభావముతో మెలగవలెను. వ్యతిరేక భావములతో మెలగుచు తగాదాపడుచుండి రేని బిడ్డ వారిలో నొకరి యండజేరి మరియొకరి నెదిరించుట నేర్చుకొనును. తల్లిదండ్రు లలో ఒకరు చేసిన దింకొకరికి నచ్చకుండినను దానిని గూర్చి బిడ్డయెదుటనే చర్చింపరాదు. తల్లిదండ్రు లేకీభవించుట లేదను సంగతి బిడ్డకు తెలియుట మంచిది గాదు. అతని యెదుట వారైక్యభావమునే చూపు టకు ప్రయత్నింపవలెను.

11. మంచిప్రవర్తనకై లంచముల నిచ్చుట, బహు మతుల నిచ్చుట పనికిరాదు. అట్లిచ్చుట చాల తప్పు. మంచిగా మెలగినందులకు కానుల నిచ్చుట, తిను బండారములను కొనిపెట్టుట చేయుచుంటిమేని మంచి పనులు డబ్బిచ్చి కొనవలసినవిగా బిడ్డ తలంచును. అందుచే అతనికి మంచి పనులకుగల నైతిక విలువ ఏమియు బోధపడదు. లంచములతోను, బహు మానములతోను, బిడ్డలకు మంచి నడత నలవడజేయ ప్రయత్నించుటచే వారు నీతిమంతులగుటకు బదులు స్వార్థపరులును స్వలాభాపేక్షనే జూపువారును, ఒరుల సంగతిని గమనింపనివారును, నీచగుణమును జూపువారును, డబ్బునకేపనినైనను చేయ సిద్ధపడు వారును కాగలరు. సౌజన్యతయు, సహకార బుద్ధియు వారికి ఉండవు.

12. కూడనిపని నేదైనను బిడ్డ చేయునపుడు వల దని వారింపక ఉపేక్షించినట్లు ఊరకుండినచో, అత నికి ఆ పనిపై ఆకర్షణపోయి దానిని చేయుట మాన గలడు. బిడ్డ స్పూనుతో బల్లనుకొట్టి శబ్దమును చేయుట కేవలము ఆ శబ్దమును వినుటకేకాదు. మన దృష్టి నాకర్షించుటకుగూడనై యున్నది. వలదని వారించినకొలది అతడా శబ్దము నింకను చేయుటకే ప్రయత్నించును. గమనించని విధమున ఊరకున్నచో కొలది సేపటిలోనే ఆ శబ్దమును జేయుట మానగలడు. మాటి మాటికి వలదని వారించుచుంటిమేని బిడ్డ వద్దన్న పనిని చేయుటయందేగాక మనల నుద్రేకపరచి వద్దని యనిపించుకొనుటయందుగూడ ఆనందము నొందును. వద్దని చెప్పుచున్నను బిడ్డ వినక, చేసెడి పనినే చేయుచున్నాడని తల్లి విసిగి ఉపేక్షతో నూర కున్నపుడు అతడెట్లు ప్రవర్తించునదియు గమనీయము. కనుసన్నలనుండి తల్లిని పరికించి తిరిగి యామె వలదని చెప్పుట కెదురుజూచుచుండును. ఇక ఆమె యేమియు ననక ఉపేక్షించుటయే తథ్యమైనచో అతడును ఆ పనిని చేయుట మానును. ఏ వయస్సుబిడ్డలైనను తాము చేసెడి కార్యమును వద్దని చెప్పినకొలది చేయు టకే ప్రయత్నించుచుందురు. అది తప్పని చెప్పిన కొలదియు నది ఒప్పని సమర్థింపగోరుదురు.

మొత్తముపై జెప్పవలసినచో నిర్మాణాత్మక క్రమ శిక్షణయందలి ముఖ్య విషయములు రెండే.

1. తప్పొప్పుల గూర్చిన జ్ఞానమును బిడ్డ కలవడ జేయుట.

2. బిడ్డకుగల న్యాయబుద్ధి నాధారముజేసికొని సక్రమ ప్రవర్తన కతనిని ప్రోత్సహించుట. ఈ రెండు విషయములను గమనించుచు శిక్షణ నొసగినను తలిదండ్రుల ఉద్దేశములతో బిడ్డ తప్పక ఏకీభవించు నని తలంపరాదు. అతడట్లేకీభవింపక వారితో ఘర్షణపడుచుండవచ్చును. ఆఘర్షణ పడుట యు మంచిదే. అవసరమనికూడ చెప్పవలెను. ఏలయన ఎల్లప్పుడు నితరుల కోరికలకు బద్ధుడై చరించుటకు తయారైన బిడ్డ వ్యక్తిత్వములేక మానసిక దౌర్బల్య మును, మెత్తదనమును జూపుచు ఇతరుల చెప్పుచేతల లోనే ఎల్లప్పుడు చరించుచుండును. తాము చెప్పి నదికాదని బిడ్డ ప్రతిఘటించినపుడు తల్లిదండ్రులు ఒక నీతికిగాని, నియమమునకుగాని నిలబడి దాని ననుస రించి బిడ్డ వినవలసినదేయని చెప్పవలెను. అప్పటికిని అతడు లొంగని యెడల నియమవిరుద్ధ ప్రవర్తన ఫలి తము నతడు తెలిసికొనవలసినదే. తన తప్పునకు తగిన శిక్షణ నతడు అనుభవించవలసినదే. బిడ్డ తొందర పాటుతో చిత్తమువచ్చినట్లు చరించి కష్టములకు

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోనిడెసాన్ - ఎక్స్యుపెరే

ఆంధ్రానుకరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ

## పరిచయ వాక్యాలు!

["రాజకుమార్" అనే ఈ కథ నేటి పశ్చాత్యావాఙ్మయంలో ఎంతో పేరు ప్రఖ్యాతులు గాంచింది. కథను సృష్టించిన అంటోనీడెసాన్ – ఎక్స్యుపెరే (Antoine De saint Exupery) ఫ్రెంచి సాహిత్యవేత్త. క్రిందటి ప్రపంచ సంగ్రామంలో వాయు విమానాన్ని నడుపుతూ అకాలమరణానికి లోనుగావలసివచ్చింది. "రాజకుమార్"లో రచయిత తన జీవితకాలంలో ఎదుర్కొన్న సంఘటనలన్నీ చక్కగా చూడవచ్చు. "రాజకుమార్" ని పాశ్చాత్యభాషలన్నిటిలో అనువాదం చేశారు. గ్రంథాన్ని రచయిత పిల్లల కోసం వ్రాసినా, దీనిని అంకితం ఇచ్చింది పెద్దవాళ్లకి. ముఖ్యంగా, బాలలో కాన్ని అర్థం చేసుకోటానికి శాయిశక్తులా ప్రయత్నంచేస్తూవున్న ఒక ఆప్తమిత్రునికి. ఒక్కసారి పెద్ద వాళ్లే పిల్లల మనోభావాలని అవగాహనం చేసుకుని, పిల్లలని, వాళ్ళ వాళ్ళ దోవల్లోనే నడవనీయటానికి వొప్పుకోగలిగారా పిల్లల జీవితం ధన్యతగాంచుతుంది. తద్వారా పెద్దలూ ధన్యతగాంచగలుగుతారని రచయిత ఆశ. అంచేతనే తను "రాజకుమార్"ను పిల్లలకోసం వ్రాసినా, పెద్దలుకూడా దీనిని చదివి ఆనందించాలని రచయిత కోరిక.
"రాజకుమార్"ను ఆంధ్రలోనికి సమర్పించేభాగ్యం కలిగినందుకు నేనూ ధన్యుణ్ణి. ఇతర దేశాలవారికిమల్లె మనవారూ "రాజకుమార్"ను ఆదరిస్తారని నా ఆశకూడా.]

నా చిన్ననాటి సంఘటనలను నెమరు వేస్తూవుంటే (ఆ రోజుల్లో నేను ఎదుర్కో-వాలసిన సంఘటనలు బోలెడువున్నాయి లేండి!) ఒక సంఘటన చప్పున జ్ఞాపకం వస్తూవుంటుంది. అప్పటికి నా వయస్సు ఆరేళ్లు అనుకుంటాను. ఆ దినాలల్లో పుస్తకాలని చదవటమంటే ముఖ్యంగా బొమ్మల పుస్తకాలని చూడటం అంటే ప్రాణాలు చప్పున లేచివచ్చేవి... ఒకరోజున మావాళ్లు బొమ్మల పుస్తకాన్ని ఒకదాన్ని నా కోసమని పెద్ద వూళ్లో కొనుక్కొనివచ్చి నాకిచ్చారు. దాన్లో పెద్ద పెద్దబొమ్మలు వున్నాయి. చిన్నచిన్న బొమ్మలు వున్నాయికూడా! మామూలుగా ఆ రోజుల్లో చూస్తూవుండే బొమ్మల్లాంటివి కావు ఆ పుస్తకంలో అచ్చువేయబడ్డ చిత్రాలు. ఆ పుస్తకంపేరు "అత్యద్భుతమైన కథలూ, గాథలూ" అని అనుకుంటాను. పుస్తకాన్ని తెరిచానో లేదో, నా దృష్టి తటాలున ఒక బొమ్మమీదికి పోయింది. కొండచిలువ చిత్రమట ఆ బొమ్మ. పెద్ద పెద్ద జంతువులకిమల్లె, ఆ కొండచిలువకూడా చాలా పెద్దదిగా చిత్రింపబడ్డది. బొమ్మక్రింద ఇలా పెద్ద అక్షరాలతో వ్రాయబడి వుంది!

"ప్రపంచంలో కొన్నికొన్ని ప్రదేశాల్లో

కొండచిలువలు అనే పాములు వుంటాయి. ఈ కొండ చిలువలు ఏవైనా జంతువుల్ని తినటానికి పూనుకున్నాయా, అలా కబళించుకున్న వాటిని ముక్కలు ముక్కలుగా చీల్చి ఆనందించకుండా, ఆపళాన పొట్టలోకి లాగుకుంటాయి. పొట్టలోకి అలా వాటిని చేర్చుకున్నాక, కదలక మెదలకుండా అర్ధ సంవత్సరంపైగా హాయిగా నిద్రపోతాయి. ఆ కాలంలో ఈ కొండ చిలువలకి ఆ జంతువులే అనేక రూపాలుగా ఆహారంగా ఉపయోగపడుతాయి" ...

ఆ వివరాలను చదివేటప్పటికి చెప్పరానంత ఆశ్చర్యం వేసింది. ఇలాంటి కొండ చిలువలని గురించి ఆ కాలంలో నాకు లభించిన పుస్తకాలని అస్తమానమూ చదువుతూ వుండటం పరిపాటి అయిపోయింది. తిండీతిప్పలకోసరం జంతువులని కడుపులో బద్రపరచుకున్న ఇలాంటి చిలువలబొమ్మలను గీయటం రంగురంగు పెన్సిళ్లని సేకరించి నా వూహకి తట్టిన రంగులను వేయటం నాదినచర్యల్లో ముఖ్యఘట్టమై పోయింది. నేను ఇలా చిత్రించిన బొమ్మలని చూస్తూవుంటే నాకే భయం వేస్తూవుండేది. మా వాళ్లకు అలా చిత్రించిన బొమ్మల్లో ఒక దానిని చూపెడుతూ "దాన్ని చూస్తే వాళ్లకు భయంవేయదా" అని ప్రశ్నించాను ... ఇంతకూ ఆ బొమ్మ ఏమిటో చెప్పమని వాళ్లని అడిగాను.

వాళ్లుదాన్ని ఎగాదిగా చూస్తూ "ఇదా! హేట్ కదూ!" అని తటపటాయించక అన్నారు కొంత మంది. "దీన్నిచూస్తే భయపడటమెందుకూ?" అని మరికొందరు చప్పున జవాబిచ్చారు. వాళ్ల ప్రత్యుత్తరాలకి నవ్వువచ్చింది. అసలు గీసింది కొండ చిలువ బొమ్మ. దాని పొట్టలో వుంది పెద్ద ఏనుగు ... ఇంకోవిధంగా గీస్తే, వాళ్ల తెలివితేటలు ఎలా వుంటాయో పరీక్షించాలని మరో చిత్రాన్ని ఆ నిమిషంలోనే చకచక గీశాను. అదీ కొండచిలువదే. దీన్లో కొండచిలువ తను కబళించుకున్న ఏనుగని ఎలా పొట్టలో దాచి వుంచుకుంటుందో సలక్షణంగా చూపాను. దాన్ని మావాళ్ళుచూస్తూ "ప్రకృతి ప్రపంచంలోనే అంత పెద్ద ఏనుగలని పొట్టలో దాచుకునే జంతువులు లేవన్నారు. ఇలాంటి పిచ్చి పిచ్చి బొమ్మలని గీస్తూ కాలంవ్యర్థం చేయటంకన్నా, స్కూలు పుస్తకాలని పుచ్చుకుని శ్రద్ధతో చదవటం మంచిదన్నారు. అలా చక్కగా చదివి పరీక్షల్లో గెలుస్తూవుంటే పెద్దపెద్ద క్లాసుల్లోకి వెళ్లవచ్చు. ప్రపంచపు మట్టూమర్యాదలని క్షుణ్ణంగా అవగాహనం చేసుకోవచ్చు" అనిసలహా ఇచ్చారు కూడా! ఆ రోజుల్లోని నా వుడుకుబోతుతనం మూలాన వాళ్ల సలహాలని వినేటంత స్థితిలో వుంటేగా!

210 వ పేజి చూడుడు

# శ్రీ రామనవమి మహాత్మ్యము

## శ్రీ స్వామి కేశవయ్యాజీ సందేశము

శ్రీరామచంద్రుడు జన్మించిన కారణంగా కోటానుకోట్ల భారత ప్రజలకు నేడు మహా పవిత్రదినం. తరతరాలనుంచి అసంఖ్యాక ప్రజలకు శ్రీరాముని పేరు ఆశను, ధైర్యాన్ని పురికొల్పింది. మానవాళికి రామనామం ఇహపరసాధనమైంది. రామాయణంలో చిత్రించబడిన శ్రీరాముని జీవితం హిందూ ధర్మానికి ప్రమాణంగా, మానవుని సాంఘిక, నైతిక జీవితానికి ఆదర్శప్రాయంగా పరిణమించింది. ప్రాచీన భారత సంస్కృతికి ప్రతిబింబం కావడంచేత, "రామాయణంలో లేనిది మరెక్కడనూ లేదు" అను ప్రఖ్యాతి దానికి ఏర్పడింది. అదే మనకు నేడు ఆధ్యాత్మిక వారసత్వంగా సంక్రమించింది.

శ్రీరాముడు ఈశ్వరుని అవతారము. అవతార పురుషులు మానవకోటికి ఉత్తములైన ఆచార్యులని స్వామివివేకానందుడు పేర్కొన్నాడు. వివేకానందుని వాక్యములివి: "సంకల్పమాత్రంచేతనే వారు మానవులకు ఆధ్యాత్మిక సంపదను సమకూర్చగలరు. వారి అనుగ్రహంవల్ల పతితులైన మానవులు సయితం క్షణంలో పరమపావనులు కాగలరు. ఆచార్యపురుషు లందరికి వారు ఆచార్యులు. వారి యందే ఈశ్వరాంశ మూర్తీభవించింది. వారి ద్వారానే మనం భగవంతుని కాంచగలము. వారిని ఆరాధించకుండా మనం ఉండలేము; వారే మనకు ఆరాధ్యదేవతలు." శ్రీరామచంద్రుడు అవతార పురుషుడే అయినా, ఐహిక దుఃఖములను, కష్టముల నన్నిటిని అనుభవించినవాడు. మానవుని భావనలో, ఆచరణలో మహోన్నత స్థితిని ప్రపంచానికి నిరూపించగలందుకై శ్రీరాముడు సామాన్య మానవునివలె ప్రవర్తించినాడు. తండ్రి మాటను జవదాటని తనయుడుగా, ఏకపత్నీవ్రతుడైన భర్తగా, అనుజులయెడ అత్యంతానురాగం గల అగ్రజుడుగా, ప్రాణసమానుడైన చెలికాడుగా శ్రీరాముడు అశేష ప్రపంచానికి అనుకరణీయుడు. ధర్మమునకే జయమన్న సూక్తికి శ్రీరాముని జీవితం పరమప్రమాణం. ధర్మరక్షణకై శ్రీరాముడు అనుభవించిన కష్టపరంపరలు ఆనాటితో అంతం కాలేదు. అధర్మాన్ని అణచివేసి ధర్మాన్ని సముద్ధరించడానికై ఈ నాటికికూడా తోడిమానవులుచేసే ప్రయత్నాలన్నిటిలోనూ ఎంతోకొంత ఆ కష్టాలు కానవస్తూనే వున్నవి. అగణితములైన జీవిత సమస్యలను పరిష్కరించుకోడానికి శ్రీరాముని జీవితంకంటె అమూల్యమైనది మరొకటిలేదు.

సాయిబాబా భక్తులకు శ్రీరామనవమి పరమపవిత్రమైన దినం. శ్రీ సాయిబాబాను "కృష్ణ రామ, శివ, మారుత్యాది రూపాయ" అనీ, పరబ్రహ్మ స్వరూపుడనీ కొనియాడుతున్నమాట వాస్తవమే అయినా, బాబా తన జీవితకాలంలోనే షిర్డీలో శ్రీరామనవమి ఉత్సవాలను స్వయంగా నిర్వహించినాడు. అవి నేటి వరకు అక్కడ కొనసాగుతున్నవి. సాయిబాబా స్వయంగా శ్రీరాముని ఆరాధించి, తనభక్తులకు సాకారోపాసనయొక్క ప్రాముఖ్యాన్ని వ్యక్తంచేశాడు.

ఇట్టి ఉత్సవాలద్వారా శ్రీ సాయిబాబా హిందూ-ముస్లిం సమైక్యతనుకూడా సాధించడానికి ప్రయత్నించారు. షిర్డీలో శ్రీరామనవమి ఉత్సవంతోపాటే ఇస్లాంమతంలో మహనీయులైనవారి గౌరవార్థం "గంధపు ఉత్సవాలు" కొనసాగించబడేవి. నాటినుంచి నేటివరకుకూడా శ్రీరామనవమి ఉత్సవంతోపాటు ముస్లిం ఉత్సవాలుకూడా ఎట్టి సంఘర్షణలు లేకుండా షిర్డీలో సాగుతున్నవి.

నేడు ఈ పవిత్రదినమున శ్రీరామచంద్రుని త్యాగమయ జీవితమునుంచి గుణపాఠములను గ్రహించి మన మానసములను నిష్కళంకితములుగా జేసికొని, కామక్రోధాదులను నిర్జించగల ఆధ్యాత్మిక బలసంపదలను పెంపొందించుకొనవలెను. "సంశయములుడిగి నన్నే శరణుపొందినవారిని నేను తప్పక రక్షింతును" అను భగవానుని వాక్యములే మన పురోగమనానికి, లక్ష్యసిద్ధికి దోహద మివ్వగలవు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# మానవసేవ-మహిళలపాత్ర

శ్రీమతి కె. పార్వతీదేవి

మానవసేవయే మాధవసేవ. ఆభాగ్యులు - రోగార్తులు పతితులు మొదలగు వారిని ఒకదారిన నడిపించి లోకకళ్యాణమునకు నాందీవచనాలు పలుకగల వారు మహిళలనుటలో సందేహము లేదు. ఇది ప్రత్యక్షరసత్యము. మానవాభ్యుదయ సాధనకు లింగ విభేదములేదు. సార్వజనీనకుటుంబముగా పరిగణింపబడే యీనాడు మానవసేవాభిలాషులు చేయగల సేవ అపారము. ప్రతిజీవియు ఏరంగములోనైనను ప్రజాసేవచేయుటకు కంకణధారి కావాలి. 'స్త్రీ' లో సహజముగా క్షమ, నేర్పు, చాకచక్యముల ప్రకృతియే ప్రసాదించినది.

అయితే కొందరు స్త్రీలు మేము చేయగల సేవ ఏముంటుంది? అని ప్రశ్నిస్తారు. నేడు భారతదేశము ప్రణాళికాయుగములోనున్నది. భావిభాగ్యోదయానికి ఇది పునాది. సాంఘిక, ఆర్థిక, నైతిక, రాజకీయ, మానసిక వికాసములకు యిది నాంది. ఈ సమయములో చిన్నారి బాలికమొదలు శతవృద్ధులుకూడా భాగస్వాములు కావాలి. అందుకు స్త్రీలు ఎంతో ముందుకురావాలి.

స్త్రీ జనాభ్యుదయమునకు పునాది అక్షరాస్యత. ప్రతి విద్యావతి పదిమందిని విద్యావతులను చేయాలి. దానికి ఎక్కువశ్రమ ప్రయత్నమూ అవసరములేదు. కాని శ్రద్ధ, సహృదయత ముఖ్యము. ఇరుగు పొరుగు నిరక్షరాస్యులగు స్త్రీలకు విరామ సమయములందు ఊసుపోకకబుర్లతో కాలము వృధాచేయక చదువుచెప్పవచ్చు. ఈ విధంగానే చిన్నచిన్న కథలు చెప్పుట వలన చిన్నారిపాపల మానసిక వికాసాభివృద్ధినొందును.

ఇక ఆర్థికరంగము. ఇందులో స్త్రీకి పాత్రయే లేదనువారుకొందరు. అది అపనమ్మకము మాత్రమే. ఆర్థికరంగంలో పురుషునికన్న స్త్రీయే ప్రముఖ పాత్రధారి. పురుషుడు సంపాదించి తెచ్చిన దానిని పొదుపుగా అదుపుగా వాడుటలో ఎంతో సహాయభూతురాలు కాగలదు. అదియును గాక కుటీర పరిశ్రమలచేకూడా భర్తకు చేదోడు వాదోడుగా నుండగలరు. వడకుట విస్తరులు కుట్టుట, అప్పడములుచేయుట. మొదలగునవి. ఈ పనులు చేయుట తమ గౌరవమునకు భంగకరము అని కొందరు భావింపవచ్చు. అది శుద్ధపొరపాటు. అపోహమాత్రమే. ఇందువలన గృహాయజమానికి ఎంతో విశ్రాంతికలుగును. అది వారిజీవితానందానికి, ముఖ్యముగా శుభదాంపత్యానికి కారణమగును.

ఈ విధముగా వనిత సబలగా ప్రవర్తించాలి. అందులో భారతీయాంగనలు ముఖ్యముగా మానవశేవ చేయుటలో అందెవేసిన చేతులు. స్వర్గీయ కస్తూరిబా, సరోజినీదేవి మొదలగువారు మనకు మార్గదర్శకులు కాగలరు. నేడు సయితము ఆరోగ్యమంత్రిణిగా పనిచేసిన రాజకుమారి అమృతకౌర్, గవర్నరు స్థానమాక్రమించిన పద్మజనాయుడు, మహిళా సంక్షేమాధికారిణి శ్రీమతి దుర్గాబాయ్ దేశ్ముఖ్ వీరంతా మానవ అభివృద్ధికి పోరాడుతున్నవారే. ఆంధ్రులు అందులో అమృత హృదయులు. ప్రతిస్త్రీ తనను తాను గుర్తించుకొని గృహమును చక్కబెట్టుకొని రేపటిభావిభారత రాజ్యాంగ నేతలుగా తమ సంతానమును పెంచాలి, ఉగ్గులో అన్ని సద్గుణములను రంగరించాలి, భర్తలోగల లోపాలను శాంతంగా సహనంలో కడిగివేసి ఉత్తముడిగా తయారుచేయాలి. అందుకే 'కాళిదాసు' ''కార్యేషుదాసి – కరణేషుమంత్రి'' అనే శ్లోకాన్ని సృష్టించాడు.

స్త్రీమూర్తి కనులు తెరచి శేవికురాలుగా మెలగిన ఈ లోకమే స్వర్గసీమ కాగలదు. గృహమే నందనోద్యానమగును. అనుకూలవతి, క్షమాభరితయగు భార్య, ఆరోగ్యవంతుడు, ఆత్మాభిమానియగు భర్త, క్రమశిక్షణ, విద్య వినయముగ సంతానము గల కుటుంబము నిజంగా స్వర్గధామమే. ఇదియంతయు ఇల్లాలి చేతిలోనున్నది. భారతస్త్రీ తలచుకుంటే ఇది ఏమంత కష్టమగు కార్యము కాదు.

# శోభ

**'బిందుశ్రీ'**



ప్రొద్దుట ఆరుగంటలవుతోంది.

ఇట్టి తరుణంలో తన కాంతి దివ్యప్రభావంతో చక్కని సుషుప్తినుండి మేలుకోమని ఆదేశిస్తూ మానవ హృదయాలలో వెలుగు నీడల పరచుతున్నాడు ఉదయభానుడు.

తూర్పు కనుమపై మొలిచిన పసుపువన్నె లేతకిరణాలు చంద్రబింబమువంటి శోభ ముఖంమీదపడి, జగన్మోహనమైన ఆమె చిరునగవుతో దోబూచులాడుతున్నాయి.

శోభ లేస్తూనే కాంతుడ్ని మేల్కొల్పి, చెరిగిన ముంగురులను సరిజేసుకొని "సుమిత్రా" అని పిలిచింది.

కిటికీ తెర తొలగించి అనంతప్రకృతి సౌందర్యాన్ని చూడటంలో నిమగ్నురాలయివున్న సుమిత్ర ఒదిన పిలుపుకు "వూ" అని సమాధానముచెప్పి అన్న ఒడిలోవచ్చి కూర్చుంది.

ఆనందరావు చెల్లితో 'సుమిత్రా - గృహలక్ష్మి ఆజ్ఞ యేమిటో కనుక్కో తల్లీ - మనిద్దరం జవదాట రాదు మరీ' - అంటూ వెలుపలికి త్రోసుకొస్తూన్న చిరునగవును నెమ్మదిగా ఆపుకుంటూ చెల్లెలి కురుల్ని దువ్వాడు.

శోభ వారిద్దరివంక కోపంగా చూసింది, తన కండ్ల మిలమిలలతో వల్లభుడ్ని తనలో బంధించుకుంటూ.

గాలికి కిటికీతెర వూగిసలాడుతోంది. ఆ తెరపై ప్రతిఫలిస్తూన్న వెలుగురేఖలు శోభ ముఖవర్చస్సుకు క్రొత్త అందాన్ని చేకూరుస్తున్నాయి.

వారిద్దరిని క్రీగంట చూస్తూన్న శోభ తన పెదవుల చాటున స్నిగ్ధసౌందర్యాన్ని దాచుకుంటూ రాయంచ నడకతో ఇంట్లోకి దారితీసింది.

"తోడు దొంగలు" అని శోభనుండి విడివడిన మాటకు వారిద్దరూ తెల్లబోయి వొకరిముఖాలొకరు చూసుకొని బిగ్గరగా నవ్వుకుంటూ కాలవాహినిలోని నిత్యకృత్యాల వేడుకను చూడటానికై శోభ వెనుకే వెళ్ళారు.

ఉదయభానుడు పోనుపోను ఒక్కొక్కమెట్టే పైకి వెళ్ళుతున్నాడు.

ఎవరికివారే యమునాతీరే అన్న వేదాంతసూక్తిని తన మనస్సులో పదేపదే తలచుకుంటూ తరలిపోతున్నాడు విరాగి ప్రపంచయాత్రకు.

## 2

ఎదురుగా వాకిటి తలుపు తెరిచివుంది. అంధకార నృత్యాన్ని బహుముఖాల విస్తరింపజేస్తోంది నిశాంగన. పగలంతా దేదీప్యమానంగ వెలిగిన పగటి వేళను సునాయాసంగ కబళించి వేసింది నిశాదేవి.

పార్కులోని రేడియో యేదో తీయని గానమాధురుల నందిస్తోంది శ్రోతల కర్ణపుటాల్లో.

గింగిరాలు తిరిగియున్న జుత్తును చేతితో ఒక ప్రక్కకు త్రోసి మరల తల ఒంచేసుకుని కుర్చీకి చేరగిలబడి విసుగుతో చేతిలోని పేపరును అవతలగా నెట్టాడు ఆనందరావు.

మానవుని చేతియందు పరాభవించబడిన పేపరు సిగ్గుతో అభిమానంతో కృంగిపోయి గాలికి రెపరెపలాడుతూ, ఆనందరావు ముఖంవైపే చూస్తోంది.

"సుగుణ రాశియైన గృహిణికి తనభర్తే సర్వస్వం. సంసారంలో ఆలుమగలు పెనుతుఫానుల ప్రసరింపనీయక ఆనంద కిరణాల చవిచూడాలంటే అటువంటి జీవిత లక్ష్యాన్ని సాధించేందుకు బాధ్యులెవరు ?"

ఓ కథకుడు వ్రాసిన యీ సమస్య ఆతని స్మృతి

పథంలో మెరసి మరల మాయమవుతోంది. ఈ విషయంలో శోభ దురదృష్టవంతురాలని తలపోశాడు ఆనందరావు.

అతని మస్తిష్కంలో మంచి చెడుల పరస్పర నిరుద్ధ భావాలు యిటు అటూ పరువులెత్తుతున్నాయి. ఈ ఆలోచనల సందడిలో ఆనందరావు ముఖంమీద నలుపు నీడలు క్రీనీడలా ఆవురించాయి. అతడు గతంలో తలపోసిన భావనలన్నీ మనో వీధిలో నర్తకిలా సాగిపోతూ వొకింతసేపు మందంగవున్న అతని మనస్సు నల్లకల్లోలపరుస్తున్నవి.

ఎదురుగా చాపమీద శోభ, సుమిత్ర ఒండొరులు వొకరి నానుకుని ఒకరు పండుకొనియున్నారు. ఒకప్పుడు శోభయొక్క సముజ్వల ముఖంలో నూతన శోభలను అవలోకించాడు ఆనందరావు. ఆమెను భార్యగా పొందిన పిమ్మట ప్రకృతి ప్రసాదించిన వనితా రత్నమని ఉప్పొంగిపోయాడాతడు.

పది నిమిషాలకాలము నిశ్శబ్దంగా గడచింది.

అతని మనస్సులో ఆందోళనయొక్క తేజస్వరూపము తొంగిచూస్తోంది. అతని కిప్పుడు తనలో మసలుతూన్న విషయం బాగా అర్థమయ్యింది.

"అగ్నిహోత్రుని సమక్షాన, వసిష్ఠులవారి ఆశీర్వచనలతో పదిమంది యెదుట భార్యగాబడసిన అర్ధాంగిని సంతోషపెట్టడం పురుషుని కర్తవ్యం."

భార్య భర్తను ఆరాధిస్తుంది, పూజిస్తుంది. తనలోని స్త్రీత్వానికి పరిపూర్ణతనే మెరుగులు దిద్దటానికి సర్వవిధాలా భర్తకు ఆసరాగా నిలచి ఆనందమందిరాన్ని నెలకొల్పుతుంది. ఆమెకు భర్తే ధ్యేయం.

ప్రేమికులు సమాజంలో దంపతులుగా మారాలని తీయనికలలు కంటారు. వారు కల్పించుకున్న ఆ ప్రేమలు కలకాలము వారి హృదయాలలో నిర్మలంగా వుంటే అదృష్టవంతులే. ప్రేమికులకు గమ్యస్థానము పెండ్లి. ఈ పెండిలియే వారి భావి జీవిత పురోగమనానికి మధురవసంతాల కురిపిస్తుంది. వారెన్నో రాత్రులు ఒంటిగా, ఆకులో ఆకుగా, పొదరింటిలోని కోయిలగా చరిస్తారు.

ఇటువంటి నిర్దుష్టస్థానాన్ని ఆక్రమించుకున్న ఆలుమగలు తమ ఆనందాన్ని తమకు కలుగబోయే పుత్రుని సమక్షంలో సద్వినియోగపరుచుకుంటారు.

తృప్తిలేని మానవుని దూరంగా విసిరేయమన్నారెవరో ఒకప్పుడు. సంతృప్తి అనేది వారల హృదయాలలో పొందికగా నిలచియుండాలి. కొంతమంది మానవులు అర్థంలేని ఆశయాలతో, సాధించలేని జీవితంలో ఒనగూడని ఆదర్శాలను వారి మనస్సులలో వూహించుకుని, నైతికంగా పతనానికి దారి తీస్తున్నారు. అందుకనే ఈ ప్రజలు సంతృప్తి అనే వున్నతపథాన్ని ఆక్రమించుకోలేకపోతున్నారు.

గడియారం 11 గంటలు కొట్టింది.

తెరచియున్న కిటికీగుండా చెవులతో పొంచి చూస్తూ తన చిన్నికండ్లతో యెదుటివాని హృదయాన్నికూడ కరగించే నేర్పరితనాన్ని ప్రదర్శించాలనే సహజ లలిత మనస్తత్వంకల పెంపుడు కుక్కను చూస్తున్నాడు ఆనందరావు, ఈతని యింటిని, ఇంటిలోని తన భార్యను, చెల్లిని యెట్టి ఒడుదుడుకులకులోను కాకుండా సర్వకాల సర్వావస్థలందు కాపాడుచుండే ప్రియమైన స్నేహితుడు ఈ భాను, (కుక్క పేరు).

ఆనందరావు హృదయంలో ఆవేదనలూరకే కట్టలు త్రెంచుకుని ప్రవహిస్తున్నాయి. అతని హృదయంలోని నైర్మల్యాన్ని కోల్పోవుతున్నాడా అన్నట్లుందిఆతని పరిస్థితి. ఆతడు నీరసంగా ఆక్రోశించాడు. అతని మనస్సు యేమీకుదుటబడలేదు.

శోభ ఒంట్లో అస్వస్థతగా వుంటోంది గతవారం రోజులనుండి. ఆమె అటులే లేస్తూ, మగనికి వుపచారంచేస్తూ, భారతనారి ఆదర్శాలను ఆశయాలను నెరవేరుస్తూ, ఆడబిడ్డ సుమిత్రకు, నీతి, సాంప్రదాయం, గౌరవ ప్రపత్తులను వల్లెవేస్తూందిప్పటినుండే. దీపపుకాంతి వెల్లువ ఆ యింటికి క్రొత్త శోభను వొనగూర్చుతోంది.

వసారాలో ఆవు అంబా యంటూ అరుస్తోంది.

"ఒదినా" అన్న పిలుపుకు కండ్లువిప్పి చూసింది శోభ. ఆమె హృదయం శృతిగా దడదడ కొట్టుకుంది కొంతసేపు.

"ఏమమ్మా - సుమిత్రా"

"మంచి నీరు" అన్న సమాధానం విని శోభలేచి పందిరి మంచంక్రింద వుంచిన మరచెంబులోని నీటిని యిచ్చి ఆమెను నిద్రబుచ్చింది. నిద్ర ఆమెకు త్రోసుకువస్తోంది. ఆవులింతలూరకే వస్తున్నాయి.

గొడ్లసావడిలో ఆవు కట్టుకొయ్యతో దెబ్బలాడుతోంది. ఆ నోరులేని జీవికి పచ్చగడ్డివేయటం మరిచి వుంటారు ఆనందరావు అనుకుంది శోభ.

నీటితో కండ్లను తుడుచుకుని పందిరి మంచంమీద ఆనందరావును చూచిందామె. పందిరి మంచంమీద చక్కని సుషుప్తిలో లీనమయ్యే ఆనందరావు ఈ రోజు యెక్కడికెళ్ళినట్లు - ఆమె మనస్సునుండి ఈ ప్రశ్న విడివడింది. ఎంత సేపటికి సమాధానము రాలేదు.

బదులుగా వాలుకుర్చీలో కాళ్ళు ముడుచుకుని నిద్రాదేవి ఒడిలో పరుండియున్న తన విభునిచూసి తెల్లబోయిందా యిల్లాలు. పక్కను దులిపివేసి, ఆతడ్ని లేపి, పండుకోబెట్టి, వాకిటిలో మేతకోసం వేచియున్న గోమాతను దర్శించాలని బయలుదేరింది.

తలుపు చప్పుడుకు ఆనందరావు త్రుళ్ళిపడిలేచాడు.

లేస్తూనే "శోభా" అని కండ్లతోటే ప్రశ్నించాడు. ఆమె తను చేయబోయే కర్తవ్యాన్ని మూగనోముతోనే బోధపర్చింది.

'అయితే నేనూ వస్తున్నా' అంటూ బ్యాటరీలైటు తీసుకుని ఆమె ననుగమించాడు. ఆవు విలాపం కట్టులు త్రెంచుకుంది. యజమానునిచూసి కన్నీరు కార్చింది. ఆలుమగల హృదయాలు జాలిగా క్షమించమని ప్రాధేయపడినాయి.

ఆనందరావు హృదయం ద్రవించింది. శోభ తెచ్చిన తౌడు రుచ్యంగా ఆరగించింది ఆవు. ఆనందరావు మేతవేసి, ఆవు వీపును ఒకసారి దువ్వి, జనుప కట్టను తినుమని లాలనగా అడిగాడు. గోమాత కృతజ్ఞతా సూచనగా వారి కభివాదంచేసింది.

చిన్నారి సుమిత్ర తన బుజ్జాయికి నిత్యం నీళ్ళు పడుతుంది. ఇది ఆమె డ్యూటీలో రోజులో నొక భాగము. గోవు తొలి సంతానానికి బుజ్జాయి అని నామకరణం చేసింది సుమిత్ర. తొట్టిలోవున్న కమ్మని కుడితి తన చిన్నారి బుజ్జాయి త్రాగుతుంటే, ఆమె హృదయ పంజరంలో కరిగినకలలు తీయని తలపుల ద్వారా వెలుపలికివస్తూ, చిన్నారిపసికూనకు, బుజ్జాయికిగల స్నేహపు ఫణితులను ఒకే శృతిలో కలిపి వేస్తుంటాయి.

నిరుడు సంవత్సరాదికి సుమిత్ర బుజ్జాయి ఆ లోకం నుండి ఈ లోకానికి వూడిపడింది. ఆ లేగదూడకు ఆకలివేస్తే, సుమిత్రకు ఆకలివేస్తుందా అనిపిస్తుంది. దాని ఒంట్లో యేమాత్రము కులాసాగా లేకపోతే సుమిత్రకూడ యేదో అయోమయంగానే ఆ కాసేపు గడపుతుంది.

ఏమిటో దైవనిర్ణయం! సుమిత్రకు ఈ లేగ దూడకు మధ్య నిర్ణయించిన బాంధవ్యాల అంతర్థమేమిటో! ఆ సృష్టికర్తకే తెలియాలి.

లేగదూడ నోరులేనిది. సుమిత్రకు వాక్కువుంది. జవసత్వాలున్నాయి. కాని బుజ్జాయితోడిదే ఆమె జీవితం.

సుమిత్రకు బుజ్జాయికి మధ్య పాదుకొనిన యిటువంటి సంబంధ బాంధవ్యాలను, వాత్సల్యము, ప్రేమలను తలచుకొని నవ్వుకుంటూ వుంటారప్పుడప్పుడు యీ ఆలుమగలు.

"తన సహాధ్యాయి యిప్పుడులేదని మూగనోము పట్టిందండోయ్" అని నవ్వుతూ అంది శోభ భర్తనుద్దేశించి.

"నిజమేనా బుజ్జీ" అని లాలనగా అడిగాడు ఆనందరావు.

ఆ లేగదూడ చిన్ని నేత్రద్వయం యజమానిని హర్ష పులకితుడ్ని చేసింది.

ఆతనొకసారి ఆకాశంవంక పరీక్షగా చూశాడు. వినీలాకాశం వింత మార్పులతో మేదినిపై స్థైర విహారం చేయబోతున్నట్లు స్పష్టమాతోంది. వీధి దీపాలు వింత కాంతితో వెలవెల బోతున్నాయి. శోద్దంతా నిర్మానుష్యంగావుంది. కార్ల కాంతి వెల్లువగావును అప్పుడప్పుడు చీకటిని చీల్చివేస్తోంది.

ఇంట్లోకి రండని చెప్పింది శోభ భర్త నుద్దేశించి.

ఆనందరావు పడకగదిలోనికి దారితీశాడు. ఆతని వెనుకే నడచింది శోభ.

బాగా ప్రొద్దుపోయింది. తెల్లవారటానికాట్టే వ్యవధిలేదు.

"అయితే ఏమిటి నీ అభిప్రాయం" ఆనందరావు ప్రశ్న.

"రేపు సోమవారం - ఆఫీసు ప్రొద్దుట 8 గంటలకు. ఇప్పుడు 2-15 నిమిషాలయ్యింది. 6 గంటలకు సాధుడు మేల్కొంటేకాని వారు 8 గంటలకు వెళ్ళటం పడదు" శోభ సమాధానం.

'మాటకారి' అనుకున్నాడు ఆనందరావు.

'ప్రళయంరానీగాక_'

అంబుధులింకుగాక - ఈ ఆడవారు వారి ఆలోచనలను, మనస్తత్వాలను, లోపల అగ్నిగోళపు తెరలుండుగాక_

పైకి మాత్రము యే మాత్రము వారి భావాల్లో వ్యక్తీకరించరు.

వెన్నలా హృదయాన్ని విప్పిచెప్పుతారు స్త్రీలు.

శోభ మూర్తీభవించిన సౌందర్య దేవత - సుగుణ గని అని సమాధానం చెప్పుకున్నాడు ఆనందరావు.

ఆతను ఒత్తిగిలిపడుకున్నాడు. ఆతని వుంగరాల జుత్తును చేతితో తాకుతూ, ఆతని పెదవులస్పృశించబోయిందామె. ఆ విశిష్టపు సౌందర్యగనియొక్క కన్నుగవ కాంతుల్నీ, ఆనందాన్ని చూస్తూ తృప్తితో మేనువాల్చాడు అతడు. శోభ ఆతని మూర్తిలోని సంతోషపు రేఖలను నగ్నంగాచూసి, తృప్తిగా కన్ను మూసింది.

8

ఆనందరావు అందరిలాటి మానవుడే. ఆతనికి విజ్ఞానము, గౌరవము యేవో అతీతశక్తుల్ని పొందాలనే వుత్సుకత మెండుగ వున్నాయి. ఇవి ప్రతిజీవి వారి జీవితాలలో లీలగ నిర్మించుకునే గాలిపడగలే. ఒక్కొక్కరు తమ మనోరథాలను, ఆశయాలను శాశ్వతంగా గాలిలో మహోన్నతపు శృంగాల్లా నిర్మించుకుంటారు. కాని వారు సృజించుకొనిన యీ గాలిమేడలు అనవరతము ఆకాశచిత్రాలలాగానే వుండిపోతాయి.

దీపాన్ని గాలికి ఒదిలిపెడితే యేమవుతుంది? హోరుగాలికి యెదురుపోరాడలేదు ఆ దీపము. ఆ దీపము కొండెక్కి వూరుకుంటుంది. అదేమాదిరి ఈ అభాగ్యుల గగనసౌధాలు గోడలు విచ్చిపోయి భూమిలో రేణువుల రూపంలో సర్దిక్కులా వ్యాపిస్తాయి.

శోభ ఆమె మాతృమూర్తి కాబోతున్నానని సంతోషపారవశ్యత చెందింది. ఆమెకు నాలుగు నెలలు గడచినవి - ఆమెకిదే తొలికాన్పు. ఆమె తనలో పెరుగుతూన్న పిండాన్ని చూసుకొని వూరకే మురిసిపోతోంది. ఆమె అతి సంతోషాన్ని చూసి ఆతడు లోలోన హర్షించాడు.

ఆమె కలలు నిజాలవ్వాలని భగవంతుని ప్రార్థించాడు ఆనందరావు, ఆమెను తన హృదయానికి హత్తుకుంటూ.

ఒకనాడు అమాయికంగా నిద్రపోతూన్న ఆమె వదనంలోని చిరునగవు రేఖలను చూసి ఆనందించాడు

ఆతడు. తనదేవి మాతృమూర్తి కాబోతున్నదని సంతోషతరంగములలో విహరించాడు ఆనాటి ఆనంద రావు. కాని భగవంతుడు ఈ సంతోషపు దినాలను దూరంచేసి, ఆమె వేదనల నధికంచేశాడు.

ఆమె ఎర్రటి పెదిమలే ఆ శిశువుకుకూడ. ఆమెకు పుట్టిపోయిన పిల్లవాడు అచ్చంగా తల్లిపోలికే. ఆమె మేనిఛాయే కుమారునికి వచ్చింది. ఆ పసివాని ముక్కుతీరు అదీ అంతా తల్లే - తల్లే మున్నూర్తులా. సందేహంలేదు.

విరించి యీ విశాల విశ్వాన్ని వింత వింత పోకడ లతో, వివిధ భంగిమలలో సృష్టించాడు. ఈ మానవ హృదయాలలో, అనేకమైన మధురానుభూతులను పొందాలనే కోరికలను నిలిపి తను ప్రక్కకు తప్పు కున్నాడు. ఇచ్చట మానవుడు పొందుతూన్న అవ్యక్త మైన ఆవేదనలను, ఆనందాలనుచూచి, తన పనిని నిర్విఘ్నంగా జరుపుకొంటూ వుంటాడు ఈ సృష్టికర్త. ఇదీ లోకంపోకడ.

4

మాతృహృదయం తన పసిపాపను అవ్యాజమైన ప్రేమతో తన వక్షస్థలిని హత్తుకొని ఆనందించాలని వుబలాటపడుతుంది. ఎల్లవేళలా ఆ బిడ్డ సంతోషమే తన ఆనందమని వువ్విళ్ళూరుతుంది ఆ మాతృమూర్తి. ఆతని కేరింతలే ఆమె వెలుగు నీడలని తలపోస్తుంది.

మాతృ హృదయం బిడ్డడు కలిగిన తర్వాత కొన్ని ఐహిక సుఖాలపై వుదాసీనత నవలంబిస్తుంది. ఆ బిడ్డనే తన హృదయానికి అదుముకొని సతతం ఆనం దిస్తుంది.

ఈ కాలపు మానవుడు ఆమెను నిందిస్తాడు. ఆమె ఓరిమిని మరోలా అర్థంచేసుకుంటాడు. పసిపాపకు పాన్పు విడిగా అమర్చాలి. వానిని నీ వద్దే యెప్పుడూ పెట్టుకుని కూరుచుంటే నీ ఆరోగ్యము చెడిపోతుంది. అసలు నీ ఆరోగ్యము యేమీబాగులేదు. ఇటువంటి సమయంలో తల్లిపాలు త్రాగితే బిడ్డడు ఆరోగ్యం చెడుతుంది. ఈ కల్లబొల్లి మాటల అంతరార్థం యేమిటి? ఆమె ద్వారా తనకు కావలసిన సుఖాన్ని పొందుదామనే కాంక్షతోటి ఆమెకీవిధంగా నీతి బోధలు చేస్తాడు.

ఇటువంటి తరగతి మానవునియొక్క క్షణిక ఆలోచనల తలచుకొని ఆనందరావు బాధతో ఆక్రో శించాడు. ఎల్లవేళలా భర్తయే తన పాలిదేవత అని కొలిచే స్త్రీ యెడలా ఈ పురుషుని యిటువంటి చేష్టలు.

అవి క్షమించరాని విషయం!

భార్య అస్వస్థత నెరిగియున్న యీ పురుషుడు ఆమెనుండి తనకు కావలసిన శారీరిక సౌఖ్యంకోసం తాపత్రయపడటం మిక్కిలి హేయం. ఆతడిలో సహనం మృగ్యం. ఆతడు మానవుడు కాడు. పశు వన్నా తప్పులేదేమో. ఒక చిన్న పొరపాటుకు చిలవలు, పలవలుచేసి, చేసుకున్న గృహిణిని బాధలు పెట్టే పురుషరత్నాలనుగూర్చి ఆలోచిస్తున్నాడు ఆనందరావు.

ఈ మనుష్యుడు చదువుకున్న వాడే. ఎందుకీచదువు. వ్యక్తిగా నలుగురిలో మెలగటానికి యెంత ముఖ్యమో- అంతే సద్గుణాలను అలవర్చుకోటం - ఇంతకు మించిన చదువు - సంస్కారం - అనే రెండు విషయాలను పుస్తకాలలో చదివి యూనివర్సిటీ డిగ్రీలు పొంద గానేసరా!

హృదయ దౌర్బల్యంకల యీ పురుషుడు, ఒక చిన్న సమస్యను తేలికగా పరిష్కరించ నేర్వలేని యీ తడు, స్త్రీని నికృష్టజీవితాన్ని గడపుమని ఆదేశించి ఆతడు సాధించేదేమిటి? ఆతడి మృగ్యపు క్షణ కాలపు ఐహిక దేహసంబంధమైన సుఖాలకోసం నలుగురిలో నగుబాట్లకు లోనవుతాడా?

ఎప్పటికప్పుడు పాతమీద ఏహ్యత, కొత్త జనిస్తుంది. క్రొత్తమీద యేదో అతీతమైన అవినా భావసంబంధం పూరకే కట్టలుత్రెంచుకుని ప్రవహి స్తుంది. ఈకాలపు అనేకుల పురుషులస్వభావాలిటు వంటివి.

ఆనందరావు ఆలోచనలకు అంతరాయంకల్గింది. ఒక ఎలుక పైనుంచి క్రిందికిదూకింది. భయోత్పాదంతో శత్రు బారినుండి తప్పుకునిపోబోతూ, వెంబడిస్తూన్న పిల్లి నోటినుండి యువతలకు వొత్తిగిలలేక ఆపిల్లి పొట్టలో హాయిగా నిద్రపోతోంది.

ఆతనిలోమరల ఆలోచనలు మొలకలెత్తాయి.

"బలవంతుడు — బలిమి లేనివానిమీద చేసే స్వైర విహారం"

"ధనికుడు - ఆశ్రీమంతుడే బీదవానిని బానిసగా చేసి రాత్రిం బగళ్లు ఆతనికండల్ని పిప్పిగా చేసి, చాకరిచేయించుకునే లోకపుతీరు"

"తనుపనిచేసే కంపెనీలోని ఆఫీసరుసవాళ్లు - తనతోడిగుమాస్తాలపై ఆతడుపయోగించే అసభ్య సంభాషణలు"

ఈ గుమాస్తాబ్రతుకు హేయమైనది. ఈ "సబార్డి నేషన్" అటువంటిది. మరొకవుద్యోగానికి తరలి పోటానికి, యీ ఆఫీసరుక్రింద బానిసవృత్తికి పూర్తి తిలోదకాలీడానికి,వానిని"Conduct Certificate" కోసం అడిగితే వాని విదలింపులు - ఆతను పన్నే కుతంత్రాలు.

సమాధానం ఒకచేపదం ఆతని నోటినుండి, గవులుకంపుకొడుతూన్న మిక్కిలి దుర్వాసనా భూ యిష్టమగు ఆ పండ్ల ద్వారా వెలువడేది-అదే- సబార్డినేషన్ !!

శూన్యాకాశంలో ఏముంటుందో వీని బ్రతుకు కూడ శూన్యంగ చకిలిబడిపూర్చుంటుంది. ఈ గుమాస్తా జీవితపు అసంతృప్తి హేయపు పుటలలో.

ఆనందరావు హృదయ భారంతో తన ఎదనిండా నీరసతను నింపుకున్నాడు. ముఖాన్నిటవల్ తో తుడుచుకున్నాడు. గడియారం ఆగకుండా ఆరు గంటలు కొట్టింది. ఆతడొకసారి తలపైకెత్తాడు.

గోడగడియారం తనపనిని నిర్విఘ్నంగా జరుపు కుంటూపోతోంది. దీని డ్యూటీకంతరాయంకల్గిస్తే...

ఇది ఆతనిలో కల్గిన వంచలనం.

ఆతని వెర్రి తలపులు గడియారపు ధ్వనిలో కలసి విలీనమయినవి.

శోభ యింకా నిద్రపోతూనేవుంది. ఆమె వద నానికి తనమొగాన్ని ఆనించ బోయాడు ఆనంద రావు.

"శోభ వులికిపడి లేచింది."

"నేనే శోభా !" అన్నాడు ఆమెను దగ్గరకు తీసుకుంటూ ఆనందరావు.

ఆమె మనిషి యిప్పుడు బాగా సన్నపడింది. మొదటి కాన్పుకే ఆమెలో యౌవనము సడలి పోయిన చిహ్నాలు కనుపించుతున్నాయి, ఆమెమేని ఛాయల నిగనిగలలో.

కొంచెం బొద్దుగ పోతపోసిన బంగారు శిలావిగ్ర హంలా ముఖంలో సముజ్వల భౌతిక సౌందర్య శ్రీ విలసిల్లే, ఆమెను చూసిన నేత్రాలు ఈ సన్నటి మనిషిని చూడలేకపోయాయి.

"చిక్కి పోయావు శోభా..."

"లేదండీ ఇదంతా నాపైమీకున్న వాత్సల్యమే అలా అనిపిస్తూవుంటుంది."

"ఊఁ"అంటూ తలవూపాడు శోభమనో రమణుడు.

తలుపు సందునుండి భానుమూర్తి తప్తకిరణ జాలము సన్నగా లోనికి పరుగెత్తుకొనివస్తోంది. ఈ ఉదయ చందిని కలలో వారి రూపులు విచిత్రంగా అపుడే మెరుగుబెట్టిన విగ్రహాల్లా కొత్తకాంతుల్లో మెరుస్తున్నాయి.

ఈ సందడిలో "ఒదినా" అన్న సుమిత్రి పిలుపు వారిని కొంచెం యెడబాటుచేసింది.

శోభ ఆనందరావునుండి తప్పించుకుని వెళ్ళి పోయింది.

అన్నా చెల్లెలిద్దరూ నవ్వుకుంటూ ఆమె వెనుకే నడిచారు.

**5**

ఆ రోజున విద్యుద్దీపాల వెలుగుల్లో మెరుస్తున్న ఆమె వదనపు సోయగాన్ని చూస్తూ, ఆమె చెంపల్ని వయ్యారంగా తాకాడు ఆనందరావు.

కొన్ని క్షణాలు గడచిన తర్వాత

చుట్టూ చీకటి భయోత్పాతంగా ఆవరించివుంది. దట్టమైన మేఘసముదాయం వినీలాకాశపు వక్షస్థలంలో దాగుకొని వింతవింత రంగులలో విచ్చటానికి సంసిద్ధమౌతున్నాయి.

ఒక్కసారి గాలి తీవ్రంగావీచింది. పెనుతుపాను వచ్చే సూచనలు విపరీతంగా కనబడుతోంది. ప్రశాంతవాతావరణము ఉరుముల మెరపులతో నిరాశా జనకమానవ హృదయంలా బావురుమంది. కాళరాత్రి ప్రళయ రేఖలలో ప్రకృతిని భీభత్స రేఖల గాలిపేలా వివరించిచెపుతోంది.

ఈ కోలాహలపు సందడి విశృతిని గలుపుతూ గదిలో శోభ నొప్పులు పడుతోంది. బయట వసారాలో కూర్చొనివున్న ఆనందరావు ఆమె పొందుతూన్న బాధను చూడలేక కండ్లుమూసుకున్నాడు. ఆ చీకటి తెరలలో వెలుగు తెరలు అదృశ్యమయినవి. కండ్లు తెరచాడు ఆనందరావు.

లోపలినుండి "క్యార్ - క్యార్" మని పిల్లవాడి యేడుపుతో భూమి దద్దరిల్లుతోంది. ఆనందరావు మనస్సులోని వేదనారావముతొలగిపోయి ఆ స్థానంలో "బాబా" రూపు చిత్రించబడి వివిధ కోణాల్లో ఆతనియెదుటనిలబడి "నాన్నా" అని పిలుస్తోంది. ఆతని హృదయం పిల్లవాని కోసం ఆతురతపడుతోంది. ఇప్పుడీ సమయంలో శోభ మూర్తిని ఒక్కసారి చూడాలనుకున్నాడు ఆనందరావు.

"శోభా" అంటూ ఆమె భర్త "ఏమండి" అంటూ ఆనందుని ఆశాజ్యోతి పొందురులు పలుకరించుకున్నారు. ఒక మహదానందం వారి గంభీరపు వదన కాంతిలో వెల్లివిరిసింది.

ఇందాకటినుండి పడిన బాధలకనుకూలంగా శోభ యొక్క లేతగులాబివంటి చెక్కిళ్ళు యెఱ్ఱబడ్డాయి. ఆమె నొసటిమీద మాచాయగా కనబడుతూన్న చిరుచెమట బిందువులను చూస్తున్నాడు ఆనందరావు.

శోభ బెడ్ మీద చెట్టుమీది యెండిపోయిన ఆకులాపడివుంది. ఆమె ముఖంలో అస్పష్టంగా ఓ మధురానుభూతి తొణికిసలాడుతోంది. ఆమె ప్రక్కనే పండల్లే పండుకొనియున్న పసికూన పాలబుగ్గలను ప్రేమతో నిమిరింది శోభ. ఎన్నినాళ్ళనుండో పొంచి యుండిన ఆమె మాతృహృదయం ఒక్కసారి విస్ఫుటంగా పారే సెలయేటి కెరటాలలా, వుప్పొంగిపోయింది. పసిపాప పాల బుగ్గల అమాయిక కాంతి రేఖల్ని పరీక్షగా చూస్తోందామె

ఎదురుగా దేవునిపటం అలంకరించబడివుంది. అగరుధూపముల పరిమళము అంతటా నిబిడీకృతమయివుంది. బృందావనిలో వేణువు నూదుతూన్న శ్రీకృష్ణపరమాత్మపైపే దృష్టినిగిడ్చిచూస్తున్నాడు పాల బుగ్గల పసిపాప. మాధవుని ఆశీర్వదించమని ప్రాధేయపడి అడిగింది శోభ.

సమాధానంగా వనమాలి చల్లనిచూపులు వారిపై కేంద్రీకరించాయి.

**6**

పసిపాపకండ్లలో పొందుపరచబడిన అమాయిక చిరునగవులను చూస్తూ, బాబు అంతా మా నాయన రూపే అంటూ ఆతని చిరు హస్తాలను తన చెంపలకు రాచుకుంటూ ముద్దులాడుతోంది చిట్టిబాబు నాయనమ్మ.

అదేమి మహాత్మ్యమోగాని యింటాకటినుంచి కుక్కినపేనల్లే మారాముచేయక పండుకొని వుండిన బాబు తాతయ్యను చూడగానే గొంతెత్తి ఒక్కసారి

శృతికలిపాడు. ఇక ఆయన వాడి అవస్థ చూడలేక పైమీద వుత్తరీయాన్ని తీసి ఒంకెకు తగిలించి బాబును భుజానవేసుకున్నాడు. బాబు ఆయనబ్రొమీసాలను చూస్తూ విచిత్రంగా వ్రేళ్ళను లెక్కపెడుతున్నాడు. ఆయన నెత్తిమీది ఆ పిలక సంపాదించుకున్న స్థానాన్ని మార్పుచేయటానికన్నట్లు దానితో తలపట్లుపడుతూ వదలకుండా వయ్యారంగా అంటిపెట్టుకుని కూర్చున్నాడు. ముసలాయన కొంతసేపు కులాసాగా, చిలిపిగా నవ్వుకుంటూ మనుమడితో ఆటలాడుకున్నాడు. రాను రాను వాడు చిలిపితనంతో చేస్తూన్న బాధను భరించలేక ఆతడ్ని వదలించుకోటానికి సిద్ధపడుతూ, బాబును కోడలికిచ్చి తను జారుకోటానికి ప్రయత్నించాడు.

వంకెన వ్రేలాడుతూన్న వుత్తరీయాన్ని తీసి గభాలున తాతయ్యనెత్తిమీదకప్పి తల్లి భుజంపై యెక్కి కూర్చున్నాడు ఉదయకుమార్.

'ఎంతటి అల్లరి పిల్లవాడవురా!' అంటూ వాడి చెక్కిలిని ముద్దుపెట్టుకొని మరీ ఆనందునితో మాట్లాడటానికి పంచలోనికి వెళ్ళాడు మాధవరావు.

7

సాయంత్రము ఆరుగంటలవుతోంది. బాహ్య ప్రపంచానికి రావటానికి తలపట్లుపడుతూ, అపుడే కనువిచ్చిన సన్నజాజివిరికన్నె తాతమనుమడి సన్నివేశపు తమాషాదృశ్యాల్ని చూస్తూ తనలో గభాలున నవ్వుకొంది.

ఆ నగవునుండి అనేక సుగంధ పరిమళాలకాంతి జగతిలో నలుమూలలా ప్రసరించాయి.

ఈ వేళలోనే నిశికాంతకూడ రాత్రివేళలో జోరపడటానికి సకలవిధాల ప్రయాసపడుతోంది.

మరల ప్రభాబాహుళ్యపు అనంతప్రకృతిలో వెలుగురావటానికి ఆ రాత్రి గడవాలిమరి!

—(o)—

# జ్ఞానోదయం

శ్రీ I. S. R. S. వెంకటప్పయ్యారావు, P. హేమసుందరరావు

## 1-వ రంగము

—:o:—

[వరండాలో పేపరు చదువుకుంటూ జమీందారు గారు కూర్చున్నారు. ఇంతలో సబ్ ఇనస్పెక్టరు ప్రవేశం.]

సబ్ ఇనస్పెక్టర్ :- Good morning Sir!

జమీందారు:-(తల పైకెత్తి) Good morning! ఓ ఇనస్పెక్టరుగారా? ఏమిటలా అర్జంటుగా దయచేశారు! అలా కూర్చోండి! బాయ్! కాఫీ పట్రా!

సబ్ :-మీతో ఒకే విషయం మాట్లాడాలని వచ్చానండి. అయినా అన్నీ తెలిసిన మీకు తెలియందేముంది?

జమీ:-అబ్బే! నాకేం తెలియదండీ! ఏమిటి అంత సందేహంగా మాట్లాడుతున్నారు?

[ఇంతలో బాయ్ ట్రేతో కాఫీతెచ్చి టేబిల్ మీద పెడతాడు.]

జ:-ముందు కాఫీ పుచ్చుకోండి!

స:-ఇప్పుడే కదండీ తీసుకుంటూ!

జ:-పర్వాలేదులెండి! పదిసార్లు కాఫీత్రాగి వుపోషమున్నా వైకుంఠ ఏకాదశిఫలం సిద్ధిస్తుందని మొన్న పురాణం శాస్త్రిలు గారు చెప్పారులెండి! చూశారూ! ఇంతకూ ఈ కాఫీ అనేది వెధవ దురలవాటైపోయిందండీ! ప్రొద్దున లేవగానే యీ కషాయంలేనిది వుండలేంకదా! ఇంతెందుకూ! మొన్న నొక రచయిత కాఫీమీద పెద్ద కథరాసి నాకు అంకితమిస్తానని వచ్చాడు.

స:-(నవ్వుతూ) ఇంకా నయం అంకితమిచ్చాడుకాదు!

జ:-చంపారుపోండి! నేను వద్దంటున్నా అంకితమిచ్చాడండీ! ఆ! ఇంతకూ ఆ తెల్లవాళ్ళు నేర్పిన వెధవ అలవాటిది! ఈ కాఫీత్రాగే మనుష్యులందరూ ఉఫ్ అంటే గాలికెగిరేట్లుగా బలుస్తున్నారు!

స:-(నవ్వుతూ) ఆ! ఇంతకూ వచ్చినపని మరిచిపోయి కబుర్లలోపడ్డాను. మీ మోహన్‌ను అదుపులో పెట్టంది లాభంలేదండీ!

జ:-(అదిరిపడి) ఇంతకూ ఏంచేశాడూ!

స:-ఏంచెయ్యాలో అదే చేశాడు! రౌడీ జట్టుతో తిరిగి అనేక ఘోరాలు చేస్తున్నాడు! బ్రాకెట్ ఆడుతున్నాడు. బ్రాందీ తాగుతున్నాడు! ఇంకా ఏం చెప్పమంటారండీ! జమీందారుగా రబ్బాయని ఇంతవరకు ఎన్ని కేసు

లొచ్చినా తొక్కిపట్టేశాం. ఈ ఘోరాలు ఇంకా ఎంతో కాలం దాగవు! రేపు సూపరెంటుదాక పోయిందంటే మాపీకలమీదికొస్తుంది! ఇకనుంచయినా వాడిని అదుపులో పెట్టకపోతే మేంచర్య తీసుకోవలసి వస్తుందండీ!

జ:-(విచారంగా తలపట్టుకొని) నా కడుపున చెడపుట్టాడండీ తప్పుడు వెధవ! ఏం జెయ్యమంటారు చెప్పండి! మీరే కాదు అటు లెక్చరర్సుకూడా నాతో చెప్పారు! కాలేజీలో చేర్పిస్తేనయినా బాగుపడతాడేమో ననుకుంటే ఇంకా ఎక్కువైంది వీడి ఆగము! ఏం చెయ్యాలి చెప్పండి!

స:-ఏంచెయ్యాలో నాకు తోచకండా వుందండీ! మరో సంగతి తెలిసింది- కాలేజి అమ్మాయిల వెంటకూడా పడు తున్నాడట ఈ ప్రబుద్ధుడు!

జ:-ఎవరయినా ఒకమ్మాయి పాదరక్ష ప్రయోగంచేస్తేపోను ఆ గోల అణగి పోతుంది!

స:-సరే వస్తానండీ! ఈ సారి నాకు రిపోర్టు లేవీ రాకుండా చూసుకుంటే మంచిది.

(నిష్క్రమణ)

[రెండు నిమిషాలు నిశ్శబ్దం, తెర కుడివైపునుండి మోహన్ ప్రవేశం.]

జ:-(తలఎత్తి) మోహన్ ఎక్కడనుంచి రావటం?

మోహన్:-కాలేజీనుంచి నాన్నగారూ!

జ:-ఐదుగంటల తర్వాతకూడా కాలేజీ పెట్టారా ఏంటీ?

మో:-ప్రైవేటుక్లాసువుంది నాన్నా!

జ:-ఉంటుంది! వుంటుంది! నీకోసమని రాత్రుల్లుకూడా ప్రైవేటు క్లాసులు ఏర్పాటుచేస్తారు! రౌడీ ముఠాతోచేరి యిష్టమయినపన్లూ చేస్తున్నావట నిజమేనా!

మో:-అబ్బే వట్టిదే నాన్నా!

జ:-అవున్లే నీకేం తెలుస్తుంది. ఇనస్పెక్టర్లకుకాని ఆ గొడవంతానూ! బ్రాందీ తాగటం, బ్రాకెట్లాడటం. ఇందుకేనా నిన్ను కాలేజీలో చేర్పించిందీ! ఇదేనారా నీవు చేస్తున్నపనీ! ఏదో చదివి వుద్ధరిస్తావని కాలేజీలో చేర్పిస్తే మన వంశానికే తీరని కళంకం తెచ్చిపెట్టావు కదరా! ఇటువంటి కొడుకువున్నా వొకటే చచ్చినా వకటే!

మో:-అంతా అబద్ధం నాన్నా!

జ:-అవునే నేనుచెప్పే నిజాలన్నీ నీకు అబద్ధాలుగా కనిపిస్తయి! ఎందుకూ జన్మ! జమీందారు కొడుకువై పుట్టి నలుగురిలో నన్ను రచ్చకెక్కిస్తు

న్నావ్! నా మీదవున్న గౌరవంకొద్దీ ఇనస్పెక్టరు నీ మీద Action తీసుకో లేదు! లేకపోతే నీవీపాటికి కటకటాల మధ్య వుండేవాడివే!

[ఇంతలో ఒక వ్యక్తి ప్రవేశం]

మో:- హల్లో రాజా! కమిన్!

జ:-(వుగ్రంగా) ఎవడ్రా వాడూ!

మో:-నా friend నాన్నా Mr. రాజా!

జ:-ఆ రాజాగాడేనా! అరేయ్ నువ్వు ముందర బయటకెళ్లు, నీ మూలంగానే నా కొడుకు నాశనమైపోయాడు! ఇంకా నిలబడివున్నావేం! నెట్టు బయటకు అప్రాచ్యపు వెధవలందరూ స్నేహితులే. అరేయ్ జవాన్ యీ రాజాగాడిని బయటకు నెట్టు - ఊ!! Get away!

మో:-(నిబ్బరంగా) నన్ననండి నేను పడతానుకానీ మనింటికొచ్చిన అతిథిని అంటే వూరుకోను నాన్నా!

జమిం:-(ఆశ్చర్యంగా) మనింటికతిథా, ఆ వుండాకోర్ రాజా! నాకంటే వాడు నీకెక్కువతీపటరా! ఇంటికూరకంటే పొరుగింటి పుల్లకూరకమ్మగా వుంటుందట! నన్ను ఎదిరించేటంతటి వాడివయ్యావటరా! నా ఆస్తిలో నీకు చిల్లిగవ్వకూడా ఇవ్వను. ఇలాఇకముందు కూడావుంటే ఆస్తి సత్రాలకు రాసేస్తా తెలిసిందా:

మో:-ఈ బెదిరింపులకేమిలే! ఎలా రాస్తారో నేను చూస్తా! పదరా రాజా వెడదాం?

జ:-ఎక్కడికిరా?

మో:-మాఇష్ట మొచ్చిన చోటికి!

జ:-(విచారంగా కుర్చీలో కూలబడుతుండగా తెరపడును)

2-వ రంగము

[జమిందారు చీకాకుగా వరండాలో అటూఇటూ తిరుగుతుంటాడు]

మోహన్ (ప్రవేశం)

జ:-ఇంతరాత్రిదాకా ఎక్కడ అఘోరిస్తున్నావురా! చెప్పు,

మో:-మా ఫ్రెండు ఇంట్లో వున్నాను నాన్నా! మీతో ఒకమాటవుంది నాన్నా!

జ:-నాతో నీకేంపని?

మో: ఒక్క రెండువందల రూపాయలు కావాలినాన్నా!

జ -రెండువందల రూపాయలా ఎందుకూ?

మో:-రాజాను ఖైదులో పెట్టారు నాన్నా వాడిని విడిపించటానికి కావాలి.

జ:-(కోపంగా) ఇవ్వను! రాజాను విడిపించ

టానికంటే చచ్చినా ఇవ్వను! చావనియ్ వెధవాయిని అలానే ఖయిదులో మగ్గిచావనీ! పీడా వదిలిపోతుంది! వాడిని విడిపిస్తావేం ధర్మాత్ముడివి బయలు దేరావ్?

మో:-నాకదంతా కుదరదు డబ్బుకావాలి!

జ:-నేనివ్వను: ఏంచేస్తావేంటి చంపుతావా?

మో:-అంతపనీ కాకండానే ఇచ్చెయండి. ఇవాళ డబ్బివ్వకపోతే శాశ్వతంగా వాడికి జైలుప్రాప్తి, ఇవ్వండీ.

జ:-వాడికి శాశ్వతంగా, జైలు ప్రాప్తి అయితే మనమంతా చల్లగావున్నట్లే

మో:-డబ్బివ్వరా?

జ: ఇవ్వను: ముమ్మాటికీ ఇవ్వనూ!

మో.-నా స్నేహితుడి ప్రాణంకోసం తండ్రి ప్రాణాన్నికూడా లెక్కచెయ్యను: కాచుకోండి (రివాల్వరు తీసిపేల్చపోతాడు)

ఇంతలో గబగబా తల్లి పరుగెత్తుకుంటూవచ్చి కొడుకుచేతిలో రివాల్వరుతీసి అవతలపారేస్తుంది:

తల్లి:-మోహన్! డబ్బుకోసం మీ నాన్నను చంపేస్తావటరా: నీకుజ్ఞానం లేదూ? నీవుబాగుపడాలనే మేంకోరుకుంటున్నాం. సాహసించి సర్వనాశనం అయిపోతానంటావా పో! ఈ డబ్బును మేమేమీ కాటికి వెళుతూ కట్టుకుపోము! ఎంతకావాలో అంతా తీసుకుపో! ఏనాటికయినా నీకు బుద్ధి తెలిసిరాకపోదు లేరా మోహన్!

జ:-ఏం? నిలబడ్డావేం చంపరాచంపు! నీవు చేసే ఘోరాలను చూస్తూ ప్రపంచానికివెరిచి కుమిలిపడ్చేదానికంటే ఒక్కసారి కన్నుమూయటం మంచిది. కానింగ్ ఇదిగో రివాల్వర్!

మో:-(హూ! అని తిరస్కారభావంగా చూచి డబ్బుతీసుకొని నిష్క్రమించును)

(తెరపడును)

3-వ రంగము

(వరాండాలో కలకలం విని జమిందారు బయట కొస్తాడు!)

జ:-ఎవరర్రామీరు! ఏమిటిదంతా ఇక్కడెందుకు చేరారూ!

బ్రాకెట్ మాస్టర్:-నేనండీ నేను బ్రాకెట్ మాస్టరిని! మీవాడు రెండువేలరూపాయలకు పందెంవొప్పి వోడిపోయాడు. ఆయన దగ్గర డబ్బులేదు: మీరైనా ఇస్తారా; లేకపోతే మీ వాడిపని ...

జ:-ఆ! మా వాడు పందెం ... వోడిపోయి రెండువేలూ ... ఏమయ్యా షావుకార్ నీవెందుకొచ్చావ్?

షావు:-మా కొట్లో తమరిపేరుతో ఎనిమిది వేలు అప్పుతీసుకున్నాడండి. డబ్బుకోసం వచ్చానండీ!

జ:-ఏరా నీవెందుకొచ్చావ్ ?

భి.భ:- నేను బీడీల కొట్టు భద్రయ్యనండీ. నాదగ్గిర దాదాపు రెండువందల రూపాయల విలువమీార సిగరెట్లు అవీ అబ్బాయిగారు పట్టుకెళ్లారండీ!

జ:_దాపరించారు అందరూ దాపరించారు నా ప్రాణానికి! ఈగల్లా ముసురుకున్నారు నా చుట్టూనూ! వాడు మీారు దూకండి ఏగంగలోనయినా! డబ్బుకావాలిగా! ఫూ పట్టుకెళ్ళండి! ఏ జన్మాన్న చేసుకున్నపాపమో ఈ జన్మాన కొడుకు నన్ను శనై పట్టుకు తింటున్నాడు! (అని నోట్లకట్టలు వాళ్ళ మీాద విసిరిపారేస్తాడు. డబ్బు చెల్లాచెదురుగాపడిపోతుంది)

[ఇంతలో ఒక గుర్రపుబండి జమీాందారు ఇంటి ముందాగుతుంది ? ఆ బండిలోనుంచి మోహన్‌ను బుజాలమీాద వేసుకుని తీసుకొస్తారు.]

జ:-ఆ! ఇదేమిటీ! ఏంజరిగింది! అయ్యో మోహన్! ఈ దెబ్బ లెక్కడివిరా! (ఏడుస్తూ కొడుకుమీాద పడిపోతాడు.)

వెంకన్న:-ఆడ ఆ రాములవారి గుడికాడ బ్రాకెట్టు ఆడుతుండారండీ మన మోహన్‌గారూ, రాజాగారునూ! బతిమిలాడి తీసుకొద్దామని నేనాడికి పోయినా. ఆటలో యిాల్లిద్దరూ వోడిపోయిన్రు. డబ్బివ్వటానికి మోహన్‌గారి దగ్గర లేదండీ. అందుకనీ బ్రాకిట్ మాస్టరుని డబ్బు తీసుకురమ్మని తమ దగ్గిరికి పంపినారు. డబ్బుకు డబ్బా గుంజారు ఒళ్లూ సితకబొడిచారండీ! అబ్బాయిగార్నీ, రాజాగార్నీ రక్షించబోయి నాకూ దెబ్బలు తగిలినాయండీ! రాజాగార్ని ఇంకో బండిమీాద ఇంటికి జేరేసినానండీ! అబ్బా! ...

జ:-వెంకన్నా నీ ఋణం ఎన్ని జన్మాలెత్తినా తీర్చుకోలేను. నా కొడుకును కాపాడి నాకప్పగించావ్. ఇదే నీ పేరున ఐదెకరాల మాగాన్నీ వ్రాసేస్తున్నాను. అదుగో డాక్టరుగారు రానే వస్తున్నారూ! డాక్టరుగారూ నా కుమారున్ని ఎలాగయినా బ్రతికించండి. మీారెంతకోరితే అంత ధన మిస్తాను!

డాక్టరు:-(మోహన్‌ను పరీక్షించి) ఫరవా లేదండీ! గట్టి దెబ్బలు తగిలినా ప్రాణానికి ముప్పులేదు. ఈ మందు వంటికి పట్టించి ఇది కడుపులోకి ఇవ్వండి. సాయంత్రంకల్లా తెలివివస్తుంది! మీారేం భయపడకండి!

జ:-ధన్యులం డాక్టరుగారూ! ఇదిగోండి ముందూ ఈ వందరూపాయలు తీసుకోండి. (అని డబ్బిచ్చును.)

రాజా జవాన్:- (పరుగెత్తుకుంటూవచ్చి) అబ్బాయిగారి కెలాగుందండీ!

జ:-ఫరవా లేదు బాగానే వుంది నీ వెవరి నౌకరువు ?

రా. జ:-నేను రాజాగారి నౌకర్ని. రాజా గారికి తెలివివచ్చింది. మోహన్‌కు ఎలావుందో కనుక్కురమ్మని పంపించా రండీ.

జ:-ఒక మోస్తరుగా వుందని చెప్పు.

రా. జ:-చిత్తం అని (నిష్క్రమించును.)

[సాయంత్రమయింది. జమీందారూ, భార్య మోహన్ దగ్గిరే కూర్చున్నారు.]

మో:-(కండ్లువిప్పి), నాన్నా !

జ:-నాయనా ఎలావుంది.

మో:-నన్ను క్షమించండి నాన్నా!

తల్లి :-ఊరుకో మోహన్ జరిగిపోయిం దేదో జరిగిపోయింది (కండ్ల నీరు తుడు చును.)

మో:-మీ మాట వినకుండా చెడుతిరుగుడు తిరిగినందుకు ఫలితం అనుభవించాను. నాన్నా! నాకు జ్ఞానోదయమయింది! మీ మనస్సులను నొప్పించి బాధల పాలు చేసిన నేను మిమ్మల్ని క్షమించ మనీ అడగటానికికూడా నోరు రాకుండా వుందినాన్నా! నాకేంశిక్ష విధిస్తారు నాన్న!

జ:-ఇకనుండి మంచిపథంలో నడపటమే నీకు శిక్ష.

మో:-నాన్నా అమ్మా! మీరు అమృత మూర్తులు

(జమిందారూ, భార్య కొడుకును హృదయానికి హత్తుకుంటారు) తెరబడును.

4-వ రంగము

(మోహన్ పుస్తకాలు సర్దుతుండగా రాజా వస్తాడు)

మో:-హల్లోరాజ్! కూర్చో!

జ:-(ప్రవేశిస్తూ) రాజునా ఎప్పుడూ రావటం ?

రా:-ఇప్పుడేనండీ!

జ:-నీవు ఇంటరు ప్యాసయ్యావుకదా పై చదువులకు వెళతావా !

రా:-లేదండీ! సబ్ఇనస్పెక్టరుగా ఆర్డరు వచ్చింది. రేపు వెళ్లి జాయిను అవు తాను. మీతో చెప్పిపోదామని వచ్చాను.

జ:-మంచిది నాయనా ఒకసారి ఇనస్పెక్టరుని ముప్పుతిప్పలు పెట్టిన నీవు ఇనస్పెక్టరు వయ్యావంటే ఆ వుద్యోగంలోవుండే బరువుబాధ్యత లేమిటో నీకే తెలిసి వస్తయి. బుద్ధిమంతుడివయ్యావు అంతే చాలు.

రా:-పెద్దలమాట పెడచెవిని పెట్టినందుకు

తగిన ఫలితం అనుభవించాము.
చివరకు నిజం తెలుసుకొని పశ్చాత్తా
పడి క్షమించమని వేడుకున్నా!

జ.-పశ్చాత్తాపాన్ని మించిన శిక్ష లేదు నాయనా!

రా:-మోహన్‌కు కూడా ఏదయినా జాబ్ చూశారా!

జ:-వాడికి వుద్యోగం చెయ్యవలసిన అవసరం ఏంపట్టింది! అనవసరంగా పంపిస్తాను. ఆ తరువాత ఇంకా చదువుతానంటే అభ్యంతర పెట్టను! బోలెడంత ఆస్తి వుంది. ఈ ఆస్తిని Maintain చేసుకుంటూ కాలుమీద కాలేసుకు తింటాడు!

రాజా:-సరేవస్తానండీ! వస్తా మోహన్.

మో: (రాజాను గాఢంగా కౌగలించుకొని ఆనందభాష్పాలు రాలుస్తూ నెలకు నాలుగు వుత్తరాలయినా వ్రాయాలి సుమా!

రా:-టా! టా!

మో:-టా! టా!

(జమిందారు ఆనందభాష్పాలు రాలుస్తుండగా తెరపడును)

# ప్రకృతి

'రాజ్యం'

—o—

క్షణంలో వడగళ్ళ వర్షం
మరుక్షణంలో నీలిమబ్బుల విహారం
అంతశయ్యలో శోకించే జీవాల రోదనం
అంతఃపురంలో పరవళ్లుత్రొక్కే
హృదయాల కిలకిలలు

ఒక రెమ్మన చిగురించే పత్రం
మరో కొమ్మన రాలిపోయే పర్ణం
గ్రీష్మంలో ప్రచండ భాస్కరుని
తాండవం
హేమంతంలో మంచాన స్రవించే
హిమం

ఇదే ప్రకృతి శోభ
ఇదే ప్రకృతిమాతా

# అగ్నిజ్వాలలు

మూలం :

శ్రీ భైరవ ప్రసాదగుప్త

అనువాదం :

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

శశిపల్కులు ముల్కులై రాధ చెవుల్లో ప్రతి ధ్వనిస్తూనే ఉన్నాయి. వివశయి చెవులమీద చేతులు గట్టిగా అదిమిపట్టుకొని తనలో లోపల అరుచు కుంటూ "వీల్లేదు, వీల్లేదు నేనల్లా చెయ్యను ! చెయ్య లేను !"

కాని అలా అన్నంత మాత్రాన ఏం జరిగేను ? ఏమీజరగకపోవడం మాత్రం జరుగుతుంది. శశి మాటలు అంగీకరించక తప్పదనే విషయం రాధకి తెలియదేమిటి ? పోనీ అంగీకరించకపోతే ... ... పోతే వివశత్వంతో కూడిన అభేద్యమైన గోడను ఢీ కొన్నట్లు అయింది. నుదుటిమీది గాయం అంధ కారాన్ని వ్యాప్తిచేయించింది. స్మృతితప్పి పడి పోతుంది.

మరి ... ... మరి ... ఆ అంధకారపు తెర. రెక్కలు తెగిన పక్షిలా లేస్తుంది. దూరం. చాలా దూరంనుంచి సెర్చిలైటుకాంతి ఆ తెరమీద నృత్యం చేస్తుంది. ఆ కాంతిలో ఏవో నల్లటి అక్షరాలు మెరుస్తాయి. బరువైన రెప్పలు భారంగాఎత్తి రాధ అక్షరాల్ని చదవ యత్నిస్తుంది. "జూలై తొమ్మిది, జూలై తొమ్మిది." రాధ ప్రాణం పోయేటట్టు అర చింది.

అవును జూలై తొమ్మిది ప్రభాతం గతంరాత్రి రాధ ప్రశాంతంగా 'మదర్' చదువుతోంది. అడు గులు చప్పుడువిని ఆశ్చర్యంగా చూసింది. పినతండ్రి, పినతల్లి. "నేను ... నేను యిప్పుడింక నిద్రపోతాను లెండి. ఈ అధ్యాయంలో ఒక్క పేరా ఉంది." అంది తడబడుతూ.

"ఏం పుస్తకమమ్మా ?" ప్రశ్నించాడు పిన తండ్రి. "ఇది గోర్కీ వ్రాసిన 'మదర్' పుస్తకం" అంది క్లుప్తంగా. "తెల్సింది - తెల్సింది" కాస్త కఠినంగా నొక్కి మాట్లాడుతూ. "చూడమ్మాయ్ ! నీలాంటివాళ్లు ఇలాంటి పుస్తకాలు చదవకూడదు. కాళీఉంటే మరో వైజ్ఞానిక గ్రంథాలు మనోరంజక మైన పని చేసుకోవాలి. ఆ చూడు ! మరోలా అను కోకు ! నీతో ఓ ముఖ్య విషయం మాట్లాడ్డానికి వచ్చాం" అని భార్యకేసి దిరిగాడు.

"ఊఁ చెప్పండి" అంది తెలియని ఉత్సాహంతో రాధ.

"అమ్మాయీ" అన్న పినతల్లి సంబోధన రాధని ఆశ్చర్యపరచకపోలేదు. ఆ సంబోధన హృదయాల తరంలోనిది కాదనియు బలవంతాన తెచ్చిపెట్టుకున్న దనియు రాధ తెల్సుకోడానికి అట్టే సమయం పట్ట లేదు.

"అసలు విషయం ఏమిటంటే నువ్వా పెళ్ళీడు కొచ్చావు. హైస్కూలు చదువు పూర్తి చేశావు. ఇప్పుడు నిన్నో పెద్దఅయ్య చేతుల్లోపెట్టి కాస్త ఆ భారం తగ్గించుకోవాలని ప్రయత్నిస్తున్నాం."

"అవునమ్మా పైకి చదివి మాత్రం నువ్వు చేసేదే ముందీ ?"అని మిగతాది పూర్తి చేశాడు పినతండ్రి.

"ఏమిటి బాబయ్యగారూ ! అలా అంటారు ? ఎక్కువ చదువుకుంటే వచ్చేనష్టమేమిటి ? యింకా నాల్గేళ్ళు చదవాలని నా వుద్దేశం. మరి ... "

మధ్యలోనే అందుకున్నాడు పినతండ్రి - "అమ్మాయ్, నీ వుద్దేశాలు నాకేమీ తెలియవు. నా ఆదాయం తగ్గిందన్న విషయం నీకు తెలియకపోవచ్చు. మీ నాన్న నీకిచ్చిందల్లా పదివేలు. ఐదు సంవత్స రాల వయస్సునుంచీ నిన్ను పోషించి చదువు సంధ్యలు చెప్పించాను. అందుకుగాను పదివేల ఖర్చుకంటె తక్కువకాదనే విషయం నీకు వేరేచెప్ప నక్కర్లే. అందుచే ఆ మూడు ముళ్లూ వేయించి నా బరువు తీర్చుకోదలచాను. శశి చదువుకూడా ఆపేయా

లనుకుంటూవున్నాను. కాని అదింకా నీకన్న చిన్న రెండు మూడు సంవత్సరాలు చదివించక తప్పదు. ఇంక నిన్ను మాత్రం చది ... "

"బాబయ్యగారూ... ..." విచారంగా యింకా మాట్లాడబోయింది.

"అమ్మాయ్, ఇంక ఏంచెప్పినా వ్యర్థం. అనవసరంగా మమ్మల్ని బాధపెట్టకు" అంటూ భార్య చెయ్యిపట్టుకుని విసురుగా వెళ్ళిపోయ్యాడు.

ఈ అకస్మాత్సంభాషణ ఆమె ప్రశాంత హృదయాకాశంలో కారుమేఘ ప్రళయతాండవం చేయించింది. ఆమె దగ్గఱ మఱెవ్వరూ లేరు. ఆమె ఎవరితో మాట్లాడుతుందీ.

ఏమిటలా జరిగిందనే ప్రశ్నకి సమాధానంరాలేదు. తలగడాలో తలపెట్టుకు వెక్కివెక్కి ఏడవసాగింది. తన జీవిత ప్రథమాధ్యాయ పరిణామం యిలా జరుగుతుందని బలవంతాన కలగనికూడా చూడలేదు. ఆమె ఆలోచించసాగింది. ఆలోచిస్తూనే ఉండిపోయింది. ఆలోచించబడ్డ విషయాలు హృదయాన్ని మథించసాగాయి. ఆ స్త్రీ సుభస్వప్నాలు...ఆకాంక్షలు ఆశలు ... అన్నీ కణకణాలతో వ్యాప్తమై నేత్ర ధారల్లో ప్రవహించి పోయాయి. నిరాశాంధకారంలో లీనమైపోయింది ఆమె ఆత్మ.

ఉదయం తొమ్మిది కొట్టేసరికి పోర్టికోలో కారు హారన్ మ్రోగింది. శశి విలువైన బట్టలు ధరించి టేబుల్ మీది టాయ్‌లెట్ వస్తువులతో గబగబా అలంకరించుకోసాగింది. తొమ్మిదికొట్టి పదినిముషాలయింది. హడావిడిగా "రాధా !రాధా", అని పిలుచుకుంటూ రాధగదిలోకి ప్రవేశించింది.

రాధ వదనం విచారంగా ఉంది. నిద్రలోవున్నా వెక్కి వెక్కి ఏడుస్తూన్నట్లుంది. ఆమె వదనంలో జీవితసారధ్య రేఖలు తాండవమాడుతున్నాయి. శశి ఒకక్షణం ఆశ్చర్యపోయింది. తరువాత రాధబుజాలు పట్టుకుని గుంజుతూ గట్టిగా - "అక్కా అక్కా ఏమిటే ఇంకా నిద్రపోతున్నావా ? ఈవేళ జూలై తొమ్మిదని తెలియదూ ? కాలేజీ ఎడ్మిషన్ రోజు కూడాను. లే, లే."

లేచి కూర్చొని మేలుకోసాగింది రాధ. రేగిన ముంగురులు విచారగ్రస్తమైన ముఖం, అస్తవ్యస్తమైన బట్టలు, కళ్ళలో ఉదాసీనత ఉత్సాహంతో నృత్యం చేస్తోంది, ఆ పరిస్థితిచూసి శశి ప్రారంభించింది.

"ఏం అక్కా ఒంట్లో బాగాలేదా ? "

"బాగానే ఉంటే." నిస్పృహాత పల్కుల్లో కనిపించింది. "అయితే ! లే ! మరి కారువచ్చి అరగంటదాటింది. కాలేజీకి వెళ్ళక్కరలేదా ? మరి ? " హుషారుగా మాట్లాడుతోంది శశి.

"అక్కర్లేదు." ఆధ్వనిలో నిజంగా ఏడుపు నిండింది. "ఏమంటున్నావ్ ! కాలేజీకి ఎందుకు రావు ? "చకితయై పల్కింది. "బాబయ్యగారి ఆజ్ఞ." "నాన్నగారి ఆజ్ఞా, బలేదానివిలే. నిన్ను శాశించడానికి ఆయనెవరు ? నాకింతవరకూ నువ్వెందుకు చెప్పలేదూ ? శశి యింతవరకూ రావడానికి కారణం ఆయనకేం తెలుసు ? తెలుసుంటే యిలా ఎందులకు చేస్తారు ? అలా ఎన్నటికీ జరగడానికి వీల్లేదు. జరగదుకూడా. శశిని కాలేజీకి పంపదల్చుకుంటే రాధను చదివించి తీరవలసిందే. లే, లే నువ్వు బట్టలు మార్చుకుంటూ ఉండు. సంగతి తేల్చుకుని యిప్పుడే వస్తాను" అంటూ రుసరుసా శశి తండ్రిగది చేరింది.

శశి సంగతి రాధకి తెలుసు. రాధ సంగతి శశికీ తెలుసు. తన బిడ్డ యింతవరకూ రావడానికి కారణం రాధయేనని శశి తండ్రికేం తెలుసు ? భేష్ ! శశి చదవడానికా స్కూలుకు వెళ్ళేది ? అదో వంక. మజాగా, విలాసంగా స్నేహితురాండ్రుతో కార్ల మీద షికార్లు కొట్టడం ముఖ్య లక్ష్యం. నూరు రూపాయిలిచ్చి నల్గురు ట్యూటర్లని పెట్టినా రాధవల్ల అయ్యేపనికాదని తండ్రితో శశి చెప్పింది. శశి తల నిమురుతూ "ఈ సంగతి ఎప్పుడూ చెప్పేవుకాదే వమ్మా ? రాధను నీవంతగా ప్రేమిస్తున్నావని నాకేమి

తెలుసు? అయినా యిప్పుడు మునిగిపోయిందేముందిలే. నీతో తీసుకెళ్లు."

"నాన్నా! నన్ను మూర్ఖురాలుగా జమకట్టండి. నా మంచి చెడ్డలు నాకు తెలుసు వేయి రూపాయలివ్వండి." చిరునవ్వుతో పల్కిందిశశి. "గుమస్తానడిగి తీసుకోవమ్మా" అని తన పనికి వెళ్ళిపోయాడు తండ్రి.

పర్సులో రూపాయలు నింపుకుని సీతాకోక చిలుకలు హుషారుగా రాధగదిచేరి - "అక్కా! నేనుండగా నీకేం పర్వాలేదులే" అంది తల్లి అన్నట్లు.

రాధ ఆత్మాభిమానం అమాయకురాల్లా ఆమె ప్రవర్తించలేదు. సదవకాశాన్ని జారవిడువకుండా శశి ననుకరించింది.

మిషన్ కాలేజీలో కో ఎడ్యుకేషన్ శశి మానసిక ప్రకృతి అలంకార ప్రపంచాన్ని ఆకర్షిస్తుంది. చాలా ప్రయాసమీద మిషన్ కాలేజీలో పేర్లు వ్రాయించింది. అక్కడికి నస్తూనే సుధని కలుసుకుంది. "సుధా నువ్వు యిక్కడేనా?" అంది ఆమె చెయ్యిపట్టుకుని.

"మరెక్కడికి వెడతానులే" అంది సుధ నవ్వుతూ.

"మా అన్నయ్య యిక్కడ ఫైనల్ చదువుతున్నాడు. రండి మిమ్మల్ని పరిచయం చేస్తాను. ఎడ్మిషన్ విషయము వాడికి ఒదిలేద్దాం. మనకి కష్టం ఉండదు." అంటూ రెండడుగులు వేసేసరికి - "అడుగో మా అన్నయ్య యిలానే వస్తున్నట్లున్నాడు" అంటూ అతన్ని కలుసుకున్నారు.

"ఇతడే మా అన్నయ్య మిష్టర్ జగదీశ్ చౌదరి"

"మరి వీరు" నవ్వుతూ ప్రశ్నించాడు.

"ఈమె నా స్నేహితురాలు శశిదేవి. సేట్ రామలాల్ మిల్ ఓనర్ గారి ఏకైక పుత్రిక."

సుధ శశి బుజంమీదచెయ్యివేస్తూ సమాధానమిచ్చింది.

శశి జగదీశ్ నూటూ బూటూచూసి ఆకర్షింపబడింది. ఆమె దృష్టి అతని దృష్టిమీదనిల్చింది. సిగ్గుతోనే "నమస్తే"

ప్రతి నమస్కారం చేస్తూనే శశి ప్రక్కనేలకేసి చూపులు పోనిస్తున్నా రాధకేసిచూస్తూ "వీరెవరూ" అని ప్రశ్నించాడు.

"ఈమె రాధాదేవి. శశి పెదతండ్రి కూతురు పాపం ... ... ..."

"నేను వీరి పేరెరుగుదును. ఎక్కడో పత్రికల్లో చదివినట్లు బాగా జ్ఞాపకము. కథా రచయిత్రి రాధాదేవికదూ?"

నమస్తే ... చాలా కాలంనుంచి మిమ్మల్ని కలుసుకోవాలనుకుంటున్నాను. నా అదృష్టంకొద్దీ మీరేవచ్చారు. ఈవేళ చాలా ఆనందగావుంది. మిమ్మల్నెరుగునని సుధ నాతో ఎప్పుడు చెప్పలేదు సుమా. అయినా ..."

"నేను ... నేను మరచిపోయాను." సుధ తప్పించుకోయత్నించింది. కాని ఒక్క విషయం దానికి కారణమైంది. నగరంలో ప్రసిద్ధికెక్కిన జమీందారు బిడ్డైన తన అన్న ఒక సామాన్యబాలికతో మాట్లాడ్డం ఆమెకిష్టంలేదు. అందుకే ఆమె ఎప్పుడు ఆ విషయం తన అన్నగారితో చెప్పలేదుకూడా.

"రాధాదేవిగారూ! మీరు వ్రాసిన ఆ అనాధ కథ ఏం చక్కగావుంది! ఆ బాలుని అవస్థ వింటే మరణించిన ఆ బాలుని తల్లి చేతులుకూడా లేచి ఆదరిస్తాయూ? అన్నట్లనిపించింది. ఏవంటావు సుధా."

"అవును" అన్యమనస్కయై పల్కింది సుధ. "మాఅక్క నిజంగా చాలాబాగా వ్రాస్తుందంటే!" జగదీశ్ దృష్టిని తన వైపు మరల్చుకోవాలని పల్కింది శశి.

కాని జగదీశ్ సిగ్గుతో తలవంచుకుని, నిల్చున్న రాధవైపే చూస్తూ అన్నారు "చూడండీ! నేను కాలేజీ ప్రతికా సంపాదకుడిని, సాహిత్యమంటే నాకు చాలా యిష్టం. రాబోయే సంచికకు మీరు తప్పక ఓ కథ వ్రాసి యివ్వండి" సిగ్గుతో ఎఱ్ఱబడిన రాధ ముఖంలోకి చూపులు వెదజల్లాడు జగదీశ్.

"ఇస్తారులే అన్నయ్యా ముందు వీరి ఎడ్మిషన్ సంగతి చూడు" అంది సుఫ విషయాన్ని దూరం చేయాలనే ఉద్దేశంతో.

"మీ డబ్బివ్వండి. ఒక్క 'నిముషంలో' పని పూర్తిచేస్తాను. ఇక్కడి రాజ్యం మనదేననుకోండి. రాధాదేవి గారూ! మనమందరంకలసి మా కారులోనే వెడదాం. ఈ వేళ పాఠాలింకా ప్రారంభించరు. ఇప్పుడే అప్లికేషన్ ఫారాలు తెస్తాను" అంటూ రాధకేసి మధుర దృక్కులు ప్రసరింపజేసి ఆఫీసు రూమ్‌కేసి వెళ్ళిపోయాడు జగదీస్.

శశి రాధా యిల్లు చేరారు. ఇద్దరిముఖాలు ఎఱ్ఱబడ్డాయి. ఇద్దరివదనాల్లోనూ ఒకే మాధకత. శశి వదనంలోని ఎఱ్ఱతనం అగ్నిజ్వాలా సదృశం. రాధ మోములోని లాలిమప్రభాత కిరణాలను రంజితమైనలే గులాభీసమం.

రాధ తనకి యిలావ్యతిరేకంగా, పోటీగా నిలుస్తుందని శశి కలలోకూడ ఊహించలేదు అనుకోని విషయాలు కనులముందు కొచ్చేసరికి మస్తిష్కంలో కలిగే పరిమాణాలూ ఎలామారతాయో అని శశిభయపడుతూ నే ఉంది. ఆమె హృదయంలో అగ్నిగోళం గిరగిరతిరిగింది. పళ్ళుపటపటలాడిస్తూ తన గదిలో గట్టిగా అడుగులు వేస్తూ పచార్లు సాగిస్తోంది రాధకి యింతగౌరవమా?

శశి క్రోధప్రథమాధ్యాయం సమాప్తిచేసింది. తీవ్రంగా ఆలోచించసాగించింది. పాపం రాధ మాత్రం ఏంచేస్తుంది? ఆ విషయంలో ఆమె నిర్దోషి. జగదీశ్ మాట్లాడినంతసేపూ రాధ పెదవికదపలేదు. రాధ చేతులు పట్టుకుని తన కార్లో కూర్చోపెట్టుకున్నాడు. పాపం రాధ చేసిందేముంది? ఆమె ననవలసిన పనిలేదు. జగదీశ్ అలా ఎందుకు చేశాడు? రాధ తనకంటె అందమైందా? ఆనే ప్రశ్నకి సమాధానంగా మేజామీద రాధా తనూ వేయించుకున్న ఫోటోను చూడసాగింది. శశి, రాధ ప్రతి అవయవంతోటీ తన అవయవాల్ని పోల్చుకుంది. ఎన్నిసార్లు చూసినా ప్రతీ విషయంలోనూ రాధకంటే తనే అందంగా ఉంది. శశి అద్దంలో తన ప్రతి బింబం చూసుకుంది. తన్నిచూసి ప్రతి బింబం ఫక్కుమని నవ్వింది. ఆనవ్వు శశిని ప్రశ్నించింది, తను యింత అందమైనదైయుండగా జగదీశ్ రాధ నెందుకు ప్రేమిస్తున్నాడని అనుకోడం ఎలా? ఆలోచనానిమగ్నయైన శశి హృదయంలో కథ విషయం మెదిలింది. అవును, ఆ విషయంలో రాధ తనకంటె ఎన్నోరెట్లు గొప్పది. తను కథ రాద్దామని ఎన్నోసార్లు ప్రయత్నించింది. ఎన్నో దస్తాలు కాగితాలు పాడయ్యాయే కాని కథ మాత్రం వ్రాయలేకపోయింది. అసలు రహస్యం దొరికింది. కాస్త శాంతి లభించింది. శాండిల్స్ విడవకుండానే తలగడాలో తలపెట్టుకుని, ఆలోచించసాగింది కథ విషయం ... ... ... ...

తుమ్మెదఝుంకారం విన్న — వికసించీ వికశించని కుసుమ హృదయంలామారింది రాధ మనస్సు. దుప్పటీ ముసుగుతన్నిగట్టిగా చెవులు మూసుకున్నా జగదీశ్ పల్కులు ఆమె కర్ణరంధ్రాల్లోంచి హృదయాంతరాళంలో చేరి గిలిగింతలు పెడుతూనే ఉన్నాయి. ఆ మధురఝుంకారాన్ని మంత్రముగ్ధయై వింటూండిపోయింది రాధ.

"ఓహో మీరు కథా రచయిత్రి రాధాదేవిగారా! నమస్తే ... చాలా ఆనందంగా ఉంది. మీరు వ్రాసిన ఆ అనాథ కథ ... ... చూడండీ! నేను కాలేజీ పత్రికా సంపాదకుడ్ని ... మీరు తప్పక ఓ కథ వ్రాసివ్వండి. ఏం సుధా వీరి కథలు బాగుంటాయి కదూ ... ...

అరే మీరలా వెడతారేం? రండి. నాతో ముందు సీట్లో కూర్చోండి. మీ రెక్కడో సిగ్గు మనుష్యుల్లా ఉన్నారేం? పెదవుల్లోని మందస్మితం లోని ఆంతర్యం? అతన్ని చూస్తే తన కెందుకింత సిగ్గు; భయంవచ్చి తన శరీరాన్ని కంపింపచేస్తాయి. తన జీవితాంతం వరకూ యీ మధుర స్వప్నం; భంగంకాకుండా ఉంటే బాగుండును. అనిర్వచనీయ మధురానుభూతులతో నిండింది రాధ హృదయం. "జగదీశ్" ఎంత అందమైనవాడు? ఎంత సరదాగా మాట్లాడుతాడు? అందమైన అమ్మాయిలా అందంగా ఉంటాడు.

(సశేషము)

# బంగారు గుడ్లు పెట్టే బాతు కథ



కొండయ్య తన వయస్సుకి తాను తెలివైనవాడే. తన తండ్రి అంత మోతుబరి కాకపోయినా ఏదో వున్న వాడే. ఆయనగారి డబ్బంతా ఇంట్లో దాచిపెట్టాడని తనకు తెలుసు. ఎలాగ? బళ్లో మాస్టారు చూడొస్తే అలమార్లో మూటకట్టుకున్న డబ్బువల్ల ఏమీ ప్రయోజనం లేదని పదేపదిగా చెప్పారయ్యె. అంతేకాదు, దొంగలు దోచుకు పోయినా పోవచ్చునట. ఎవరయినా అడ్డుపడతారనుకున్నా దొంగలు పీకె పిసుకుతారనే భయమో? ఈ విషయాలు తండ్రితో చెబుదామనుకున్నా ఆయనగారికి కోపం ముక్కున ఉంటుంది గదా!

సరె, అనుకున్నంతా అయింది. అవతల వీధి పెద్దింటి కామందుగారింట్లో దొంగలు పడి, ఇంట్లోవాళ్ల గొంతులో గుడ్డలు కుక్కి ఇల్లంతా దోచుకుపోయారని మర్నాడు ఊరంతా ఒకటే హోరు! తాను తండ్రితో చెప్పడానికి ఇదే తగిన సమయం "డబ్బు తెలివిగా పెట్టుబడి పెట్టడమంటే బంగారు గుడ్లు పెట్టే బాతును పెంచుకోడం లాంటిది. మూట కట్టుకున్న డబ్బు ఎప్పుడూ పెరగదు నాన్నా-" ఎలాగయితేనేం తెగించి తండ్రితో చెప్పేశాడు కొండయ్య. తండ్రికి కూడా తను చెప్పింది సబబుగానే తోచింది. ప్రాణమన్నా, డబ్బన్నా ఎవరికైనా తీపేకదా!

మీ పొదుపు ధనం జాతీయ ప్రణాళిక పొదుపు సర్టిఫికేట్లలో గాని, ఇతర పొదుపు ఉద్యమ సెక్యూరిటీలలో గాని పెట్టుబడి పెడితే ప్రభుత్వం హామీ ఉంటుంది. పన్నులు లేకుండా వడ్డీ కిడుతుంది. అంతేకాకుండా జాతీయాభివృద్ధి కార్యక్రమాలు సత్వరంగా అమలుజరగడానికి అవసరమయ్యే సహాయం చేస్తూన్న సంతృప్తి కూడ మీకు లభిస్తుంది.

**12. ఏళ్లో జాతీయ ప్రణాళిక పొదుపు సర్టిఫికేట్లు**

- పన్నులు లేకుండా సాలీనా 5.41% వడ్డీ
- రూ 5 మొదలు రు 5,000 వరకు వివిధ విలువల్లో ప్రతి పోస్టాఫీసులోనూ లభ్య మవుతాయి.
- ప్రభుత్వం హామీ ఇచ్చినవి

చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం తాలూకు ఇతర ప్రభుత్వ సెక్యూరిటీలు :

**10.**ఏళ్ల ట్రెజరీ సేవింగ్సు డిపాజిట్ సర్టిఫికేట్లు
పోస్టాఫీసు సేవింగ్సు బ్యాంకు డిపాజిట్లు






## జాతీయ పొదుపు ఉద్యమ సంస్థ

ఇతర వివరాలకు: నాగపూరులోని నేషనల్ సేవింగ్సు కమీషనరుకు గాని, మీ రాష్ట్రానికి సంబంధించిన రీజినల్ సేవింగ్సు ఆఫీసరుకు గాని వ్రాయండి.

# శ్రీ రామనవమి ఉత్సవం



శ్రీరామనవమి ఉత్సవాలసందర్భంలో మెనాయ్ నగరంలోని సాయీ నిలయంలో మదరాసు రాష్ట్ర అంతరంగిక వ్యవహారాల శాఖమంత్రి శ్రీ ఎం. భక్తవత్సలం అధ్యక్షతన కిందటి నెల 29 వ తేదిన సభ జరిగింది. నగరమంతటినుంచి చాలామంది సభకు వచ్చారు.

శ్రీరాముని జన్మదినం కనుక భారతదేశంలో లక్షలాది భక్తులకు శ్రీరామనవమి పుణ్యదినమని స్వామి కేశవయ్యజీ తమ ప్రత్యేక సందేశంలో అన్నారు. ప్రజలందరికీ శ్రీరామనామస్మరణ తారక మంత్రమన్నారు. షిర్డీలో శ్రీసాయి బాబా శ్రీరామనవమి ఉత్సవాలను ప్రారంభించడంవల్ల సాయీభక్తుల దృష్టిలో శ్రీరామనవమికి ప్రత్యేక ప్రాముఖ్యం ఉన్నదన్నారు. శ్రీరాముని పూజించడం ద్వారా దేవతార్చనకుగల ప్రాముఖ్యాన్ని సాయిబాబా విశదం చేశారు. అంతే కాక హిందూ ముస్లిమ్ సమైక్యతకూడా ఈ ఉత్సవాన్ని నిర్వహించడం సాయిబాబా ఆశయమన్నారు. షిర్డీలో శ్రీరామనవమి ఉత్సవాలతోపాటు అదే రోజున ముస్లిమ్‌ల ఉత్సవంకూడా పొరపొచ్చములు లేకుండా సామరస్యంగా జరుగుతుండేవన్నారు.

రామచరిత వివరించే గుణపాఠాలను సంస్మరించిమనస్సులను పవిత్రం చేసుకుంటే క్రమంగా జీవిత సాఫల్యాన్ని అధిగమించగలుగుతామనీ కేశవయ్యజీ వివరించారు.

సభికులకు శ్రీ టి. పురుషోత్తం స్వాగతం చెప్పారు. భక్తిసిద్ధాంతం ప్రచారానికి కేశవయ్యజీ చేస్తున్న కృషిని విశదం చేశారు. ప్రార్థనా సమావేశాలను జరుపుకునే మంటపం నిర్మించేందుకు సాయీ నిలయం ఎదురుగా ఉన్న ఖాళీస్థలాన్ని ఉచితంగా ఇప్పించవలసినదిగా మంత్రికి విజ్ఞప్తి చేశారు

అసౌకర్యాలను లెఖ్ఖచెయ్యకుండా సభకు వచ్చినవారిని మంత్రి శ్రీ భక్తవత్సలం అభినందించారు. రామాయణం ఎన్నిదివంటిదని మన మాదిరిగానే జన్మించి జీవితానుభవాలను పొందిన కళ్యాణ అవతార పురుషుడు శ్రీ రాముడు అని శ్రీ భక్తవత్సలం విశదంచేశారు. ఇంకా ఇట్లాచెప్పారు:

"శ్రీరాముని జీవితచరిత్ర ఆధారంగా వాల్మీకి, కంబన్, తులసీదాసు వంటివారు ఉత్తమ కవిత్వం వ్రాశారు. తమిళనాడు ప్రజలలోభక్తి ఎక్కువ. వారి జీవితంనుంచి భక్తిని ఎవరూ విడదీయజాలరు. హాయిగా

217_వ పేజి చూడుడు




# "మేనమామ చెవులో జుట్టువుంటే"

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

ఒక వూళ్ళో రంగయ్య అనే ఆసామి ఉన్నాడు. వాడు కొంచెం అమాయకుడు. అది ఆధారంగా తీసుకుని అందరువాణ్ణి ఏడిపిస్తూవుండేవాళ్లు.

ఇలా వుండగా ఒక రోజున రంగయ్య "అదృష్టంలేదో నాకు" అని ఏడుస్తూవుంటే ఎవరో చెప్పారుటగదా. "రంగయ్యా! రంగయ్యా! నీకు అదృష్టం పట్టాలంటే నీ మేనమామ చెవులో జుట్టు దట్టంగా పెరగాలి. మీ మేనమామ చెవులో జుట్టు లేదేమో నీకు పట్టలేదేమో" అని ఉచిత సలహా ఇచ్చారు.

రంగయ్యకు ఇది నిజం గాబోలునని అనుమానమేసింది. వెళ్ళి నిద్రపోతున్న మేనమామ చెవును చూచాడు. ఖాళీగా ఉన్నది. ఇక లాభంలేదని అడవికివెళ్లి తపస్సు ఆరంభించాడు.

ఎట్టకేలకు విష్ణుమూర్తి ప్రత్యక్షమై "ఏం రంగయ్యా ఏమి నీ కోరిక" అని అడిగితే "స్వామీ ఏమీలేదు. మా మేనమామ చెవులో జుట్టు పెరిగేటట్టు చేద్దూ" అన్నాడు మన రంగయ్య.

"మంచిదేదన్నా కోరుకోకపోయినావా రంగయ్యా!" అని విష్ణుమూర్తి అడిగితే-

"మీరు నేనడిగింది స్తే ఇవ్వండి లేకుంటే లే"దన్నాడు.

"అయితే నీ ఖర్మం! తథాస్తు" అంటమేమిటి - ఇక్కడ రంగయ్య మేనమామ చస్తున్నాడు చెవులో పెరిగే జుట్టుతో.

మన రంగయ్య ఎగురుకుంటూ వస్తున్నాడు మేనమామ దగ్గరకు తన ప్రభావము, తనకు పట్టబోయే అదృష్టాన్ని గురించి చెప్పటానికి. అంతలో "ఏం, రంగా" అని మేనమామ కనపడి అడిగాడు.

"మామయ్యా! మామయ్యా! మేనమామ చెవులో జుట్టువుంటే అదృష్టంపడు

తుందని ఆ పుల్లయ్యా చెప్పాడు. నేను తపస్సుచేసి నీ చెవులో జుట్టుపెరిగేటట్లు వరం పొందాను. ఇక మన అదృష్టం చూచుకో'' అన్నాడు ఉత్సాహంతో.

''ఓరి నీ తాడుతెగా నీ అదృష్టం కోసం నన్ను ఇలా చంపకపోతే, అదృష్టమే కావాలని కోరుకోకపోయావురా పిచ్చివెధవా'' అన్నాడు.

''అదీ నిజమే. అలా చేయాల్సింది'' అనుకున్నాడు రంగయ్య.

రంగయ్య అప్పటినుంచి పిచ్చిరంగయ్య అయ్యాడు. అప్పటినుంచే ఎవరన్నా ''బాగులేదని'' అనుకొంటుంటే ''ని మేన మామ చెవులో జుట్టుందా'' అంటూంటాడు.

మీకు కథ బాగుందా. మీ మేన మామ చెవులో జుట్టుందా!!!

—:o:—

# కలిసివచ్చిన కాలం

శ్రీ కడియాల అమర్‌సుందర్

పూర్వం ఓ బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు ఆయవారాలు చేసుకుంటూ జీవిస్తుండేవాడు. రోజూ ఉదయమే లేచి కాలకృత్యాలు తీర్చుకొనేవాడు. భార్య పెట్టిన చద్దిని ఊళ్లోకి వెళ్లేవాడు. అందరికీ తిథివారనక్షత్ర ఫలితాలు చెప్పేవాడు. పొరుగు ఊళ్ళకుకూడా వెళ్ళి చెబుతుండేవాడు. రోజూ అలా ఉదయమే వెళ్ళి మధ్యాహ్నానికి ఇంటికి తిరిగివస్తుండేవాడు. ప్రజలు సమర్పించిన తృణమో ఫణమో స్వీకరించి భార్యకు తెచ్చి ఇచ్చేవాడు.

బ్రాహ్మణుడు మంచి మాటకారి. ఎవరితో ఎట్లా మాట్లాడాలో బాగా తెలుసు. అంతేకాదు. తెలివితేటల్లో అతన్ని మించినవాళ్ళు లేరు ఆ ఊళ్లో. ఏ శాస్త్ర రాతకోతల పని వచ్చినా ఊళ్లోవాళ్లంతా అతనిదగ్గరకే పరుగెత్తుకు వచ్చేవారు.

ఈ విధంగా అతడావూళ్ళో అందరికీ కావలసినవాడయ్యాడు. అతణ్ని గురించి అందరూ ''ఎంత మంచివాడు!'' అని చెప్పుకునేవారు.

బ్రాహ్మణుడు ఓ రోజున ఆలస్యంగా ఇంటికొచ్చాడు. వచ్చీరాగానే వంటింటిలోంచి గుప్పుమని పిండివంట వండుతున్న వాసనవచ్చింది. భార్య అప్పటికే పిండివంట పూర్తిచేసింది. భర్త వచ్చేసరికి పొయ్యిమీదనుంచి నూనె మూకుడుకూడా దించేసింది. చేసిన పిండివంటమీదకూడా మూత పెట్టింది.

భర్త గబగబా వంటింటిలోకి వచ్చాడు. కాసేపు వాసనచూశాడు. ''ఇవ్వాళ నువ్వేం వండిందీ చెప్పనా?'' అన్నాడు.

''ఆఁ చెప్పకోండి చూదాం!'' అంది భార్య.

''బూరెలు చేశావు కాదూ?'' అన్నాడు భర్త.

భార్య ఆశ్చర్యపోయింది. ''మీకెలా తెలిసిందండీ!'' అడిగింది ఆదుర్దాగా.

''నేను దివ్య దృష్టిలో చూశాను. అంచేత తెలిసింది.'' అన్నాడు భర్త గంభీరంగా ముఖం పెట్టి.

"ఏమిటీ ? దివ్యదృష్టితో చూశారా ? నిజంగా !" అని రెట్టించింది భార్య.

"అవునని ఎన్నిసార్లు చెప్పాలే పిచ్చికొయ్యా!" అన్నాడు భర్త కొద్దిగా కోపం నటిస్తూ.

భార్య నిజమేనని నమ్మేసింది. తన భర్త దివ్యదృష్టిని గురించి అమ్మలక్కలందరికీ చెప్పింది. అసలే ఆవిడ ఉత్తి వాగుడుకాయ. ఇటువంటి విషయాలలో అయితే మరింకా చెప్పవలసిందేమిటి ? పనికట్టుకొని ఊరందరికీ చెప్పివొచ్చింది.

ఊళ్ళో జనమంతా బ్రాహ్మణుని అడగటం మొదలెట్టారు. "ఏమండీ ! మీకు దివ్యదృష్టికూడా ఉందిటకదూ !"

బ్రాహ్మణుడు తెలివితక్కువవాడేం కాదు. "ఏదో ఆ పరమాత్ముని దయవల్ల, మీ చలవవల్ల ..." అనేసి ఊరుకునేవాడు.

"నిజమే కామోసు" అనుకున్నారు ప్రజలంతా. అప్పట్నించీ అతన్ని మరింత గౌరవంతో చూట్టం మొదలెట్టారు. బ్రాహ్మణుడు పొరుగూళ్లు వెళ్లనవసరం లేకపోయింది. ఆ ఊళ్లోనే జరుగుబాటు చక్కగా సాగుతోంది.

ఓ రోజున ఆ వూళ్ళో షావుకారు ఇంట్లో దొంగతనం జరిగింది. డబ్బూ దస్కం, నగలు వగైరా పోయాయి. దొంగలు మాత్రం దొరకలేదు. మరి ఇకపోయిన సొమ్ము ఎట్లా దొరుకుతుంది ? ఇంతలో బ్రాహ్మణుడి విషయం గుర్తుకొచ్చింది, షావుకారుకు. వెంటనే కబురు పంపించి పిలిపించారు.

"ఓ బ్రాహ్మణోత్తమా ! మీ దివ్యజ్ఞాన సంపత్తిని గురించి మేమిదివరకే విన్నాం. దయచేసి మా ఇంట్లో జరిగిన దొంగతనంలో పాల్గొన్న దొంగలను గురించి ఆచూకీ ఇవ్వండి !" అని వేడుకున్నాడు షావుకారు.

ఈ మాటలు వినేసరికి బ్రాహ్మణుడికి ఏమనాలో కూడ తోచలేదు. కాసేపు అలాగే నిర్ఘాంతపడి కడకు తేరుకున్నాడు. కాస్త ధైర్యం పుంజుకున్నాడు. దేవుడుమీద భారంవేశాడు. ఎలుగెత్తి అరిచాడు. "ఓ రామా ! నీ చేతిలో ఉన్నాయి..." అన్నాడు బిగ్గరగా.

అదే సమయంలో అక్కడ తరట్లాడుతున్న పాలేరు రాముడు ఈ మాటలు విన్నాడు. వాడికి ముచ్చెమటలుపోశాయి. కాళ్లు వొణికాయి. చేతులు గడగడలాడాయి. బ్రాహ్మణుడికి దివ్యదృష్టి ఉందనే విషయం వినిఉండటం మూలాన అతను చెప్పింది తనను గురించే అనుకున్నాడు.

"అయ్యా ! క్షమించండి ! నేనే చేశాను" అని బ్రాహ్మణుడి కాళ్ళమీదపడ్డాడు రాముడు.

"ఇంకెప్పుడూ అలా చెయ్యకు. మంచిగా మెలగడం నేర్చుకో. దేవుడు నీకు మేలుచేస్తాడు. లే !" అని లేవదీశాడు బ్రాహ్మణుడు.

బ్రాహ్మణుడి ముఖం ఒక్కసారి విప్పారింది. ఒక్క క్షణంక్రితం విచారసాగరంలో మునిగినవాడల్లా ఇప్పుడు సంతోషసాగరంలో ఓలలాడిపోతున్నాడు.

షావుకారు అతని దివ్యజ్ఞానాన్ని మెచ్చుకున్నాడు. అనేక కానుకలిచ్చి పంపించాడు.

బ్రాహ్మణుడి కీర్తి దవానలంలా ఆదేశం యావత్తూ పాకిపోయింది. ఏనోటవిన్నా, ఏయింట కన్నా అంతా అతని గురించిన మాటలే

బ్రాహ్మణుడు ఆయవారాలు చేసుకోవడం మానేశాడు. ఆ కానుకలతో హాయిగా కూచుని తింటున్నాడు.

ఇలా కొంతకాలం జరిగింది. ఒకనాడు రాజుగారి ప్రాసాదంలో పెద్ద దొంగతనం జరిగింది. అమూల్యమైన రత్నాలు, వజ్రాలు, వైఢూర్యాలు దొంగిలించబడ్డాయి. ఎంతగా ప్రయాసపడ్డా దొంగలు మాత్రం దొరకలేదు. రాజుగారికి కోపంవచ్చింది. మంత్రిని పిలిపించి అన్నాడు. "రేపటికి దొంగల

ఆమాకీ తెలుసుకురాకపోతే నీ తలతీసి కోట గుమ్మానికి వేలాడకడతాను !"

"చిత్తం !" అని చేతులు నలుపుకుని బయట పడ్డాడు మంత్రి.

బ్రాహ్మణుడి విషయం మెరుపుగాతట్టి వెంటనే మనుష్యుల్ని పంపాడు మంత్రి.

బిక్కముఖంవేసుకుని రాజు ముందు నిలబడ్డాడు బ్రాహ్మణుడు. విషయమంతా వివరించి చెప్పాక బ్రాహ్మణుడి ముఖంమీద కత్తివేటుకుకూడా నెత్తురుచుక్కలేదు. "ఏదో ఒకసారి రక్షించబడ్డాను అనుకుంటే ఈసారి ఆసలుకే ముప్పవచ్చేటట్లుందే" అనుకున్నాడు. ఏంచెయ్యడానికీ పాలుపోలేదు. ధైర్యం చిక్కబట్టుకున్నాడు కాసేపటికి.

ద్వారపాలకుల దగ్గరకు వెళ్ళాడు. "ఒకటి, రెండు, మూడు" అని లెక్కపెట్టాడు బిగ్గరగా. మళ్లీ రాజుగారి దగ్గరకు వచ్చాడు. రాజుగారికి వినురుతున్న సేవకులనుచూచి "నాలుగు, అయిదు, ఆరు" అన్నాడు.

ద్వారపాలకులు, రాజుగారి సేవకులు కలిసి చేసిన దొంగతనం బయటపడిపోయింది. "ఆ సంఖ్యలు తమను ఉద్దేశించి చెబుతున్నవే" అనుకున్నారువాళ్లు. వెంటనే వాళ్ళు బ్రాహ్మణుడి కాళ్ళమీదపడ్డారు. క్షమించమని ప్రార్థేయపడ్డారు. దొంగసొమ్ము తీసుకొచ్చి రాజుగారి ముందుంచారు.

రాజుగారికి చాలా ఆశ్చర్యంవేసింది. బ్రాహ్మణుడి దివ్యజ్ఞానానికి పట్టరాని సంతోషం పొందాడాయన. అమూల్యమైన అనేక రత్నాలు, హారాలు, వజ్రాలు, వైఢూర్యాలు, మాణిక్యాలు బ్రాహ్మణుడికి కానుకలుగా సమర్పించాడు రాజు. ఘనంగా సత్కరించి మరీ ఇంటికి పంపాడు.

ఆ కానుకలు స్వీకరించి ఇంటికొచ్చాడు బ్రాహ్మణుడు. ఇంకా ఆ దేశంలో ఉంటే ఎప్పటికైనా ముప్పు తప్పదని నిర్ణయించుకున్నాడు. మూటా ముల్లె సర్దుకొని ఆ రాత్రే మరో దేశానికి ప్రయాణమయ్యాడు బ్రాహ్మణుడు. రాజుగారిచ్చిన కానుకలతో అక్కడ హాయిగా జీవించారు భార్యాభర్తలు.

•••—•••

# యుక్తి

శ్రీ ఎ. ఎ. ఎన్. రాజు

అలమూరను గ్రామంలో
ఉండేవాడొక ధనవంతుడు
సోమన, రామన్న అను
పుత్రులుండే వారతనికి

కొంతకాలానికతనికి
సమీపించింది వృద్ధాప్యం
ధనమంతా ఒక్కనికే
ఇవ్వదలంచా డతడు

ఇల్లునిండే వస్తువు తెమ్మని
చెరొక రూపాయిచ్చాడు
పందెంలో నెగ్గినవానికే
చెందునన్నాడు ధనమంతా

సోమన్న బజారుపోయి
కొన్నాడొక బండెడుగడ్డి
తొందరగా యింటికితెచ్చి
గృహమంతా నింపాడు

పాపం ఆ బండెడుగడ్డి
ఇల్లు నిండుటకు సరిపోలేదు
పందెంలో ఓడినందుకు
సోమన్న తెల్లమొహం వేసాడు.

రామన్న బజారునుండి
మైనపువత్తులు తెచ్చాడు
నేర్పుతో ఒక్కొక్కటిని
ఇంట్లో వెలిగించాడు

క్షణకాలంలో యిల్లంతా
కాంతితో నిండుకున్నది
పందెంలో నెగ్గిన సోమన్న ముఖం
కలువకుమల్లే వికసించింది.

రామన్నయొక్క యుక్తికి
మెచ్చాడా ధనవంతుడు
అన్నమాట ప్రకారంగా
ఇచ్చేసాడు తన ధనమంతా.

# కామాయని

మూలం :
శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :
కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.

దేవగణములన్నియు కర్తవ్యపథ విముఖులై సంయమవిహీన జీవితములను గడపుచు ఉల్లాసవిలాసములందు మునిగి తేలుచున్న కాలమది. ధర్మనిర్వాహణావైముఖ్యము మహాప్రళయమునకు దారితీసినది. దేవలోకమున ప్రేమలీలలు ఉల్లాసవిలాసములు పరిసమాప్తములైనవి. నశ్వరమైన దేహమునే ఆత్మగా తలచి, దైహికానందమునే యానందమనుకొని, తదానంద సాధనయే జీవనధ్యేయమనితలచియు కార్యకరణమునకు వెనుదీయని సమయమున కర్మానుగుణముగ దేవలోకమున మహాప్రళయము సంభవించినది. దేవతలు తమకలుషాగ్ని జ్వాలలయందు తామే భస్మీభూతులైరి. ఆలోకమంతయు దగ్ధమై ప్రళయజలమగ్నమైనది. ఎటుచూచినను విలియజలధినిర్ఘోషములు. గగనమున ప్రళయజీమూతముల ప్రచండార్భటులు.

దేవలోకమున మనువొకండుతప్ప సర్వులు పంచత్వము నందిరి. మనువుతానొక యోడయం దాసీనుడాయెను. తనగమ్యస్థానమేదో తనకే తెలియదు. ముందుప్రళయ జలమధ్యమునుండి తప్పించుకొనవలెను. తత్క్షణమే అతడొక యోడయం దాసీనుడై పయనమొనర్చెను. భీకరతరంగముల తాకిళ్లకులోనై యిటునటునూగులాడుచు కతిపయదినములు గడచిన తరువాత మనువుయొక్క నౌక హిమవత్పర్వతశిఖిర ప్రాంతమును చేరినది. తత్పర్వతో పరిశిఖరాగ్రము నారోహించి, తరుణతపస్వియొకండు గాఢతపమొనర్చుచున్నటులు దృశ్యమానుడగుచు, మనువుజలప్రళయ ఫలితమున నేర్పడిన సురలోకశ్మశానమును తదేక దృష్టితో చూచుచుండెను. అతనినిచూచి ప్రళయసాగర తరంగములుకూడ దయార్ద్ర చిత్తములైనవి, జలధిశాంతించినది!

మనువు తన యోడనొక విశాల వట వృక్షమునకు కట్టియుంచెను. ప్రళయజలము లుపశమించినవి. పుడమి నెమ్మదిగ కడవినుండి బైటపడజొచ్చినది. మనువుయొక్క హృదయము కరుణారసనిష్యందినియైన కావ్యమువోలె వేదనామయమైనది. అతని హృదయవేదన వినుటకు ప్రకృతి తప్పవేరొండెవ్వరును లేకుండెను. ప్రకృతికట్టి వేదనలు సుపరిచితములగుటవలననే కాబోలు నాయముకూడ మనువుయొక్క హృదయవ్యథను వినుట కౌదాశీన్యము వహించినది!

## చింత

ప్రళయఫలితముగ ప్రకృతియందు కానుపించిన భీకరదృశ్యములను చూడగనే, మనువుయొక్క మనస్సునందు తొలిసారిగా చింతయుదయమందినది. ప్రకృతితన నెటులనూ, లక్ష్యపెట్టక తనగోడువినుటకై యదివరకే నిరాకరించినట్లు కనుపించెనుగాన అతనికి చింతయే శరణ్యమైనది. మనువు చింత నిట్లు సంబోధించినాడు.

"ఓచింతా, నేడుతొలిసారిగ నీదర్శనమైనది. ప్రపంచమను నందనవనమున విషభుజంగమవు నీవు! అగ్ని పర్వతము బ్రద్దలైనప్పుడు తొలిసారిగాపైకి వచ్చు జాలాముఖివి! 'లేమి' అను కారణమునకు జనించు చపలబాలికవునీవు! నీవు మానవునిమస్తకము నందుండి, మందభాగ్యమును సూచించుదురదృష్ట లిపివి! భీతియను జలధియందుద్భవించునట్టి యస్థిర తరంగమవు! నిరంతరము జీవులరక్తమును పానమొనర్చుచు, అనవరతమాతనిని ప్రయత్నశీలునిగ నొనర్తువు ... నీవేచింతవు!"

'చింత'నుసంబోధించుచునే మనువుచింతాక్రాంతుడయ్యెను. గతకాలపు స్మృతులతో నశించిన సుఖసంపదలనుగూర్చి 'చింత' నొనర్చినకొలది దుఃఖమాతనినిమరింత దట్టముగాచుట్టుముట్ట జొచ్చినది. ఐనను దేవసృష్టియొక్క దివ్యవిలాసములను గూర్చిన స్మృతులాతని వీడకుండెను. అతడట్లే చింతింపసాగెను.

"ఒకప్పుడు దేవలోకము సౌఖ్యములనెడు మణిదీపముల వెలుగులతో కలకలలాడుచుండెను నేడది యంతయు నంధకారమయమైనది. నిరాశాపూర్ణమైనది. ఆకాశవీధినియనిలములెట్టులు సర్వదా మేఘసమన్వితములై యొప్పునో, యటులనే దేవలోకమంతయును, నిత్య సౌఖ్యసంభరితమైయుండెడిది. సర్వశక్తిసంపదలు, సమస్తసౌఖ్యములు దేవతలయధీనమునసుండెడివి. నిత్యైశ్వర్య సుఖ సంపన్నతవలన జనించిన సంతోషము, వారిజీవిత సాగరమునసొక చంచల తరంగమువలె సంచరించెడిది. దేవతలదివ్యజీవిత కుసుమములు, నిత్యమును ఆమోదప్రమోద పరిమళగంధములను వెదజల్లుచుండెడివి. రానురాను దేవతలు, కేవల భోగవిలాసమయులై, ధర్మనిర్వహణావిముఖులైరి. తత్ఫలితముగ సురలోకము శ్మశానమైనది. ఉషస్సునుబోలి నవయవ్వనములతో, చంద్రికల నపహసించు సురుచిరమందహాసములతో, సదాభ్రమరములవోలె స్వేచ్ఛగా, నిశ్చింతగా పరిభ్రమించు దేవబాలల సుందరశృంగార విలాసములు — ఆ మలుకుమిటారుల సోయగములు — అన్నియును వినష్టములై నశించినవి! భోగవిలాసములు దగ్ధములైనవి! సుగంధపుష్పలతా కుంజముల మధ్య సయ్యాటలాడు దేవకన్యలప్రేమలీలలు శూన్యమున కలిసిపోయినవి! సురబాలలమధురగానములు మాయములైనవి! "మదిరాసవ పానవిశేషముచే నెవరినెవరినేత్రములను రాగభరితములై కించిదరుణితములై యుండెడివో, ఎవరిశిరములందు కల్పవృక్షము సదా సుకుమార సుందర కుసుమములను వెదజల్లుచుండెడిదో అట్టి దేవతలు, అసంతృప్తి వాసనలకు తామే ప్రతినిధులై యొక్కసారి నాశమందిరికదా!"

ఇట్లు మనువు దేవలోకమునందలి భోగములను తలచుకొని వానినాశమునకు దుఃఖించుచుండగనే భయంకరప్రళయదృశ్యములను గూర్చిన స్మృతులచే చింతాసాగరమున మరింతలోతుకు మునిగెను. "ఆహా ఎచట దేవబాలల నయనకమలములనుండి యానంద బాష్పములు వర్షించుచుండెడివో యచటనే భీషణ మేఘములనుండి భయదవర్షములు కురియుచున్నవి. అచటి దేవసుందరుల కంఠమున వ్రేలాడు నవవికసిత పుష్పమాలికలు, ఉరిత్రాళ్లైనవి! ఎచట యజ్ఞబలుల పూర్ణాహుతులు ప్రకాశించెడివో అచటనే జలధితరంగములు ప్రళయనర్తనములు! దశదిశలవినవైన హాహాకారధ్వనులతో ఆర్తనాదములతో, వజ్రములుకూడ సహస్రశః విశ్లథములై చూర్ణీభూతములైనవి. విద్యుల్లతలు ముక్కముక్కలై పడి భీకరధ్వానము లొనర్చు మాటిమాటికి పృధ్విని కంపిల్లజేసినవి. భూమికంపమొందుచున్నట్లుకనుగొనిన తోడనే యాలింగన మొనర్చి యుదిమిపట్టుకొను చున్నదోయనునట్లు ఆకాశము వినీలమై వర్షరూపమున పుడమిని సోకినది. మరియొకవైపున కుటిలములగు కాలపాశములో యనునట్లు జలధితరంగములు చుట్టుముట్టినవి. ప్రపంచమూలతత్వముల భయాకరసమ్మిశ్రణమది.

మనువు హిమాలయ శిఖరమపై యోచనాశీనుడై చింతించుచుండగనే, దేవలోకమునందలి గతకాలపు సుఖభోగవిలాసములును, వాని పరిణత స్వరూపములైన భీకర ప్రయయదృశ్యములును మరల నొకసారి కండ్లకు కట్టినట్లయ్యెను. ఇంతలో వాతావరణమునం దొక క్రొత్త మార్పుగోచరింపసాగెను. అది ఆశ.

## ఆశ

నిజకిరణపటల విరాజమానయగు జయలక్ష్మీవలె యుషాసుందరి యంధకారమును చీల్చి చెండాడుచు, నవోదితయైనది. ఉషఃకిరణములధాటి కోర్వజాలక దాగిపోయెనో యనునట్టులంధకారమదూరీభూతమయ్యెను. ధరిత్రిని మలిన మొనర్చిన భయభీతులు తొలగిపోయెను.

వర్షకాలముగడచినది. శరత్కౌముదులు నవనవవికాసములతో దినదినప్రవర్ధమానములైనవి. హిమకణముల విమలజలములచే తమముఖములను ప్రక్షాళన మొనర్చికొని యభ్యుదయమునందుచున్నవో యనునటులు వనస్పతులు తలలనెత్తినవి. జలధిశాంతించి

నది. గతించిన ప్రణయరాత్రమునందలి కోలాహల మునకున్న పితురాలైన క్రొత్త పెండ్లికూతురనదగు పృథ్వి సముద్రమునుళయ్యపై కూర్చొనియున్న దేమో! నన్నట్లు కానుపించెను. ఏమైనను పృథ్వి మనువున కొకనూతన ప్రపంచము. అందు,తన ఏకాంత స్థానమును తానేమరలమరల కలియజూచికొనుచు, కొంతసను యముగడపెను. అంతయును నిశ్శబ్దమయముగనున్నది. హిమఖండములకోలాహలమున జీవకోటి బిగ్రబిగిసి కొని చైతన్యమును కోల్పోయెనోయనిపించినది. ఎంత చూచినను మరొకరు కానరాకపోవుటచే మనువు మరల ఆకసమువంక చూచెను. ఇదేమి! మదిరాపాన మత్తుడెవడైన తలక్రిందులగునట్లు విసరికొట్టిన ఆసవ పాత్రయా? యను విలక్షణ భావనలతో నాకాశమును తిలకించుచుండగనే కష్టములుతొలగిపోయి నిక వగవ పనిలేదని చెప్పుచున్నట్లు మలయానిలము మెల్లగ వీచెను. విరాట్ పురుషుడు ప్రపంచపటముపైనొక క్రొత్తచిత్తరువును రచించుటకై బంగారమును రంగ రించుచుండెనో యనునటు లుషఃకాంతులు వెల్లి విరిసెను.

ఆ విరాట్ స్వరూపుడెవ్వరో! ఎవ్వనియాజ్ఞచే సూర్య, చంద్ర, వాయు, వరుణాదిదేవతలు నియతి ననుసరించి చరించున్నవారు? ఎవనిసంకల్పమాత్ర మున ప్రళయమువచ్చినది? ఆ సమయమున సూర్య, చంద్రాదులేల ఖిన్నులై వివశులైరి? ప్రకృతికధిదేవత లైనవారలే యట్లు దుర్బలులగుట యెంతటియాశ్చ ర్యము! సూర్యచంద్రాదులకుగాని, నాకుగాని, వాస్తవమైన యస్తిత్వమేలేదేమో! అవును. లేదు. మేమందరము ఆ ప్రకృతిచేతి కీలుబొమ్మలము. విధి చేతి పాచికలము.

ప్రళయము ప్రకృతి యొక్క భయంకర పరివర్తనము. అసలు ప్రకృతియేసదాపరివర్తనశీలమైనది. జీవుల యైశ్వర్యాకాంక్ష్యన్నతులెంత యత్నించినను పరివర్తన మును నిరోధించుటపొసగదు. అది యవశ్యంభావి.

ఈ జిజ్ఞాసయే క్రమశః పెరిగి, స్వానుభవమునందొక యనంతశక్తిగా రూపొందినది. అదియే ఆశ. దానిని మనువిట్లు వర్ణించెను. "హృదయమునందుత్సుకత నుద్భవింపజేయు మధుర స్వప్నమువోలె మనము నావహించి విచిత్రభావనలను జనింపజేయుచు, ప్రకాశమానమైన మరొక వింత రూపమునుదాల్చి నాలో ప్రాణములను సంచరింపజేయుచున్నావు! ఆశా! నీ వెంతటి యద్భుత రూపిణివి?"

'ఆశ' యాతనిలో మరింతగా వికాసమంది మనోరంజకముగా కానుపించినది. అది జీవన సంగీత రాగ మాధుర్యమును కర్ణపేయముగా వినుపించి, మనువును తన్మయించి, లోకమునందు స్వస్థానమును కల్పించుకొనవలెనను దృఢలాలస నుత్పన్న మొనర్చి నది.

ఇంతలో ప్రకృతి కాంత నావచ్ఛాదించిన యంధ కారయవనిక పూర్తిగవైదొలగెను. ప్రళయాత్పూ ర్వమున నెట్లు పచ్చపైరులతో కలకలలాడుచుండెనో అటులనే ప్రకృతి హరిత శాద్వలములతో నలరారి నది. కంటికానునంతవరకును పుడమి బంగారు పంట లతో కలకలలాడినది. సుఖశాంత సంతోషములకు మూలకారణమై, ప్రళయజల నిర్మగ్నమగు తరిభూమి కాశ్రయ మొసంగి కాపాడునట్టి యుదారమూర్తి యును, బహువిధ మణిరత్ననిధానమును, అగు హిమ వత్పర్వతమును సమీపముననేకాంచి, గాఢ నిద్రా వస్థలో మధురస్వప్నమును కాంచి ఆనందమగ్నుడై, రోమాంచితుడైనట్లొక యనిర్వచనీయానుభూతి నందినాడు. ఆ మహామహీధరము తన నిస్తబ్ధతా మనోహర వైభవముతో, శీతల జలస్వచ్ఛ నిర్ఝరు లతో జీవిత మాధుర్యమును పునఃపరిచయ మొనర్చు చుండెను. హిమవత్పర్వతమునందలి సువిశాలమైన సుందర గుహలో నొక రమణీయ స్థానమును మనువు స్వనివాసముగ నొనర్చుకొనెను. ఆతని మనమున నిసర్గమైన దైవీ సంస్కారము జాగరితమై యజ్ఞ కర్మములను నిర్వహింప ప్రేరేపించెను. దృఢనిశ్చ యముతో నాతడు జీవితమును తపశ్చర్య కంకిత మొనర్చెను.

దినదినమూ, మనువొనర్చు యజ్ఞము లహార్నిర్ధూరు

ములచే భూమ్యాకాశములు నిత్యసుగంధ యుక్తము లగుచుండెను. యజ్ఞమున శేషించిన యన్నము నాతడు ప్రతిదినమునను దూరముగ కొంపోయి విడచి వచ్చుచుండెడివాడు. జలప్లావనమునుండి దైవానుగ్రహావేశ వశముననే యితర ప్రాణియైనను సురక్షితమై బ్రతికియున్నచో, తత్ప్రాణి కాయన్నమాకలి తీర్చుకొని ప్రాణములు నిల్పుకొనుట కుపయుక్తమగునను తలపుతో నాతడు హవ్యశేషాన్నమును మరువక దినదినమును దూరస్థలమున నుంచెడివాడు. దుఃఖమును వ్యాయముగ ననుభవించిన కారణముననే దుఃఖ బాధాతీవ్రతను మనువు గ్రహింపగల్గెను. ఇతరుల దుఃఖములనుచూచి ఖేదపడనేర్చెను. దుఃఖనివారణకై ప్రయత్నము సలుపతలచెను.

మనువు సదా గంభీరమైన మౌనమును ధరించి, జాజ్వల్యమానమగు హవనకుండముకడ నుపస్థితుడై దీర్ఘచింతలో నిమగ్నుడగుచుండెడివాడు. ఆతడు నెరపునది పవిత్రకర్మమయ జీవనమైనను, అందలి ఏకాంతవాసము, ఏకాకితనము, మనువునకు విచార హేతువయ్యెను. నింగివైపునకు చూచుచు తిన యొంటరితన మెప్పుడంతమగునోకదాయని మనమున విలపించుచుండెడివాడు. ఆతని యాంతరంగనేస్త మైనవి యత్పథమునందలి తారకలు మాత్రము కాంతి వితాన మొనర్చుచు హృదయమున కాహ్లాద మొనగూర్చుచుండెను. అట్టి ప్రకృతి దృశ్యములను చూచుకొలది, నిద్రాణమైన యాతని మనము, ముకుళితమైన పుష్పములు విరియబూసినట్లు చైతన్యవిలసితమై వికాసము నందుచుండెడిది.

మనువుయొక్క అనాదివాసనలు నూతనస్వరూపము ధరింపసాగెను. తనలో మధుర మధురమైన ప్రాకృతిక వాంఛ లెన్నో విద్యమానములయ్యెను. ఆతని హృదయమే పూర్వపరిచితయైన ముదితతోడ ద్వంద్వ సౌఖ్యము ననుభవింప వాంఛించినది. ఏకాన్తజీవితమునకు స్వస్తిచెప్పి తత్క్షణమే తానొక సహజీవితోడి మధుర సాంగత్యము నొందగోరినాడు.

కాని యాతని జీవితములో-తనను, తప్పించినచో మిగిలిన దంతయు శూన్యము! ఇక ద్వంద్వ సౌఖ్యము నందలి మధురానుభూతి కవకాశ మెక్కడ? "ఓనా శూన్య జీవనమా! నే నెంతవర కిట్టు లేకాంతనివాసమున బంధితుడనై యుండవలయునో? దుఃఖభరితమైన నా జీవనగాథను నెవరి వీనుల మీద విన్పించి హృదయ తాపము నుపశమింపజేసికొందునో?" అని అంతరంగమున తర్కించుచు - "కాదు కాదు నేను సదా మౌనమునే వహింపవలెను. నా హృదయము నందు గుప్తమైన కోశాగారమగు నా 'చింత'ను నేనేల వ్యర్థముగా బహిరంగ మొనర్పవలెను!" అని వెంటనే చింతతో సతమతమగుచుండెను. ఆతడట్లాలోచించుచుండగనే, సురుచిర దరహాస దంతరుచులనీనుతరుణివలె నాతని కట్టెదుటనే వెన్నెలరాత్రి సహచారిణియై భాసించినది. ఆమెను మనువిట్లు సంబోధించినాడు.

"నిశాసుందరీ, అదిగో, నీ యంబరమైన యాకసమునుండి చెరగుజారుచు నస్తవ్యస్తమగుచున్నది దాని నొకపరి సద్దుకొనుము. నీ యాభరణములైన తారకలు రాలి చిందర వందరగా పడియున్నవి. వానిని వేవేగ పొందుపరచుకో! ఓ రజనీ. యవ్వన మదమత్త విలాసినీ, నీ యంబరమైన నీలాకాశపు పైట చెరగు చినిగినది, తొలగినది కాబోలు! నీ మాయా విశ్వము నీ యంగ ప్రత్యంగ సౌందర్యమును దోచుకొన జూచుచున్నది. ఆ ... ... నీవా సంగతి నెరుగనట్లుంటివే! నీ అపూర్వ సౌందర్య విలాసముల విన్నాణివైన నీవు విరక్తవై తిరగాడుచున్నట్లు కనుపించుచుంటివేల? నీవు విరహమున తప్తమగుట వలన ఏగాయముల మచ్చలు నీ హృదయపథమున నేర్పడినవో - వాటిని మరచిపోయి మరల వెదకికొనుచుంటివా?

నేనుకూడ నీ వలెనే యొక వస్తువును మరచితిని. అది ప్రేమయో, బాధయో, భ్రమావేశమో జ్ఞప్తికి వచ్చుటలేదు. అదేమైనను - నా హృదయమున

కానంద ప్రమోదములను చేకూర్చును. ఒక వేళ రజనీ! ఆ విస్మృతి వస్తువు నీ కెక్కడనైన కనుపించిన యెడల, నీ యలంకారములైన తారాగణముల సౌందర్యములను ప్రకృతిని దోచుకొని నిచ్చినట్లులే, నా వస్తువునుకూడ దోచుకొని నీయకు సుమా!

## శ్రద్ధ

మను విట్లు కల్పనా లోకమున విహరించుచుండగనే యాతని వీనులకొక సుకుమార కంఠస్వరము వినబడెను. అది యొక పిలుపు. "సంసార సాగర తరంగములచే తీరమునకు విసరికొట్టబడిన కాంతిమయ రత్నవద్భాసమానులై, నేడీనిర్జన వనమున స్వర్గోచిత ప్రభాపటలములను విరజిమ్మునట్టి మీరెవ్వరు?" ఆ యాక్రోశము మనువు చెవుల సోకినది. ఆ మధుర కంఠ నాద మెటనుండి వినవచ్చెనో ఆ దిశకేసి యతడు చూడగా ఆ దిసనే యొక సుందరనారి మనువునకభిముఖముగా వచ్చుచుండెను. ఆదికవియగు వాల్మీకి సుందర ఛందములనుపోలిన యమృతవాణి యామె ముఖమునుండి వినిర్గతమైనది. వినీల సుందర వస్త్రమును ధరించిన యామె సుందరకోమల యర్ధనగ్న శరీరము మేఘపటలమునందొక గులాబిరంగు మెరపు వలె కట్టెదుట కనుపించినది. అమృతాస్వాదనమునకై నీలమేఘములు చంద్రుని పొందగోరుచుండెనో యను నట్లామె ముఖచంద్రమపై నల్లని కుటిలకుంతలముల యందము విలసిల్లినది. ఆ జవ్వని నామధేయము శ్రద్ధ. మనువు శ్రద్ధతో తనను తాను పరిచయ మొనర్చుకొనుచు నిట్లనెను.

"జాజ్వల్యమానమైన జ్యోతిర్మండల మాకాశము నుండి పతనమునొంది నిరాధారమై పరిభ్రమించునటుల నేనీ నిర్జనస్థానమున నిస్సహాయుడనై ఏకాకిగ తిరుగాడుచున్నాను. ధరామ్యాకాశముల మధ్య నా జీవనము, యుక్త్యుపాయములచే పరిష్కరింపబడని దుర్భరనిత్య సమస్య! నా బ్రదుకొక ఘటాకాశము! ద్రవీభూతమై, ఝరీరూపమును దాల్చి సాగరమునకలిసి మరల పూర్వస్థితినిపొందని హిమఖండమును నేను! నా యీ జీవన మొక నిగూఢ, రహస్య సమస్య! విస్మృతి మార్గముల వెంబడి నడచుచు, జీవన సమస్య నెరుగుటకై యహంకార పూర్వక యత్నముల నొనర్చుచు, విఫలుడనై, తిరుగాడు వెడగుతాడను! నేను— మను నామధేయుడను!

(సశేషము)

# శ్రీరామకర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

౧౮

రుద్ర విష్ణు బ్రహ్మరూపుండై, ధర్మార్థ
కామరూపుండైన, కమలనయన!
మానివర్యులకెల్ల – మందారవృక్షమై
పరగెడి శ్రీరామ! పంకజాక్ష!
పూర్ణదయామృతంబునకు, సముద్రుండై
సత్యభానాథుండై – సార్వభౌమ!
వైరాగ్యచిత్తుల భక్తిభావంబున
కాధీనుండైన, సత్యగుణచరిత!
నాదగుణమగు స్థలము, సమ్మోదముగను
పొంది యుండెడు శ్రీరామ! పుణ్యపురుష!
శ్రీ మనోహర! రాఘవా! చిత్ప్రకాశ!
వందన శతంబు లర్పింతు సుందరాంగ!

౧౯

సాత్త్విక తత్త్వ విస్తారముద్రిత భావ
హృదయంబుఁగలవారి నెఱఁగినావు
బ్రహ్మపిపీలికా – పర్యంతమా, జీవ
గణముల వసియించి గ్రాలినావు
అది విరాట్స్వరూపావతారముఁ దాల్చి
శేషశయ్యఁ బరుండి చెలఁగినావు
అమృతదాయువగుచు నానంద రూపుండై
యారు చక్రంబుల నడఁగినావు
నాల్గు భుజములతోడ విన్నాణముగను
ప్రభల వెలుఁగొందుచున్నావు; రామరత్న
మా! వరద! భజియింతు నేమముగ నిన్ను
రక్షణము సేయుమయ్య! శ్రీరామచంద్ర!

౨౦

సూర్య సుతుఁడు, విభీషణ శూరవరుఁడు
భరత లక్ష్మణ శత్రుఘ్న భ్రాతృవరులు
సతము నిన్భక్తిసేవల సలుపుచుండ
భవ్య సాకేతపురములో–దివ్యపీఠ
మందు, సీత సేవింప నానందమొందు
శుక, వశిష్ఠాదమౌని సంస్తుత చరిత్ర!
ప్రణవబీజ సారాత్మకా! రామచంద్ర!
ప్రార్థనము సేతు; రక్షింపు పరమపురుష!

౨౧

చంద్రబింబమువంటి–చారు మొగమువాఁడు
రత్నకుండలముల ప్రభలవాఁడు
దశకంఠుఁ దునిమిన – దర్పంబు గలవాఁడు
శ్రీ విభీషణునిఁ బోషించువాఁడు
విజయంబు సాధించి ప్రియముఁ జూపెడి
వాఁడు
లక్ష్మితో, సతము వెలసెడువాఁడు

మూడులోకములకు ముద్దుఁగూర్చెడివాఁడు
తామరపత్ర నేత్రములవాఁడు
గొప్పవగు, ధనుర్బాణముల్ గూర్చి, శత్రు
నాశనముఁ జేయఁగలవాఁడు ; నంద నంద
నుండు, దామోదరుండు, విష్ణుండు, రామ
చంద్రుఁ డతని సేవింతు రక్షణముకొఱకు.

౨౨

కనక కుండలముల కాంతిఁ బ్రకాశించు
చెక్కిళ్లుగల్గిన శ్రీయుతుండు
స్థావర జంగమాత్మక జగద్రూపుఁడై
యఖిలాస్పదుండైన - యవ్యయుండు
జ్ఞానాంశరూపుఁడై - మానివర్యులకెల్ల
బోధించునట్టి సద్బుధవరుండు
పాదపద్మంబుల - భాగీరథీదేవి
జనన మొందినయట్టి సత్ప్రభుండు

రమణ ధర్మార్థ కామమోక్షములనియెడు
నాల్గు పురుషార్థములనిచ్చు నాథుఁడెవఁడు ?
అట్టిఁడు, చరమపీఠ మధ్యస్థు రాము
నాశ్రయింతును సతతంబు నయమొనఁగ.

౨౩

శ్రీ సనందనముని శ్రేష్ఠున కిష్టుఁడై
దశరథ పుత్రుఁడై దనరురామ !
దేవేంద్రుఁడాదిగా దేవసమూహముల్
సేవింపఁ జెలువొందు శ్రీ శుభాంగ !
వేదస్వరూపుఁడై - విజ్ఞానజలధియై
సీతా సమేతుఁడై చెలఁగురామ !
వైకుంఠ నగరాధిపతియయి, తత్త్వసిం
హాసనస్థుఁడగు, బ్రహ్మర్షి వినుత !

రామభద్ర ! నిన్ను నేమంబుగా, ధ్యాన
మాచరించి, మనసునణఁచి, యింద్రి
యముల నిగ్రహించి, యమనియమాదుల
భజనసేయుబుద్ధిఁ బరగనిమ్ము ;

౨౪

'మణిపూరకం'బను-మహితచక్రంబందు
గొప్ప తేజముతోడఁ గొమరుమిగిలి
శ్రీ 'అనాహత' చక్ర - సిరిమధ్యమున, హంస
మంత్రనాదముతోడ మహిమఁగూడి
సార 'సహస్రార' చక్రంబునందున్న
చంద్రబింబామృత సారమందు
ప్లుతమైన దేహంబు భ్రమణంబుగఁగల్గి
యఖిలంబునకు, మూలమై, వెలింగి

దశరథాత్మజుండు, తత్త్వవిచారుఁడై
వెలయుచున్నవాఁడు ; విశ్వజనుల
రక్షణంబు సేయ దక్షుఁడై యున్నాఁడు ;
యతని నాశ్రయింతు ననుదినంబు.

(సశేషము)

# వరకట్న నిషేధశాసనము: ఒక పరిశీలన

కె. వి. యస్. సూర్యనారాయణరాజు



కాలము మారుతూవుంటుంది దానితోబాటు మనుష్యులూ మారుతూవుంటారు. మనుష్యుల వుద్దేశాలు, ప్రవర్తనలూ - ఆచరించే కార్యాలూ మార్పుజెందుతూంటాయి. అప్పుడు అనుసరించే ఎత్తుగడలూ, ప్లానులూ కూడ తప్పనిసరిగా మారాలి. మారకపోతే లాభములేదు. వెనుకదిగబడిపోవాలి. అప్పుడు ఆయావ్యక్తులు తనవ్యక్తిత్వమును కోల్పోయి అనామతులవుతారు. కాబట్టి పరివర్తన వాంఛనీయము. దీన్నే "పరిణామ వాదము"_అంటాం

సమాజము ఎన్ని దురాచారములతో కృళ్ళి కృసించుచున్ననూ నిస్వార్థపరులైన సంఘసేవా పరాయణులు ఎప్పటికప్పుడు ముందుకు వచ్చి సమాజమును సంస్కరించి సరియగు పంథాన నడిపించుచునే వచ్చిరి లేనియడల యిప్పటికెన్నడో నామరూపములు లేకుండగ నశించిపోయి యుండెడివారము ఆవిధముగానే మన ఆంధ్రజాతిలోకూడ ఒకరివెంటనొకరు మహాపురుషులుద్భవించి ఎప్పటి దురాచారముల నప్పుడు రూపుమాపుచునే యున్నారు.

నేటి మన సమాజ వ్యవస్థలో బలిష్టముగా వ్రేళ్లుపాతుకొనిపోయి అనేక అభాగ్యకుటుంబాలను నామరూపములు లేకుండా చేయుచున్న సాంఘిక దురాచార సమస్యలనేకము మనకళ్ళఎదుట పురులు విప్పి నిత్యమూనాట్యం చేస్తూనేయున్నాయి. అట్టి సమస్యలలో వరకట్నదురాచారమొకటి ఈ విషయము చాలకాలము క్రిందటనే మన పూజ్యబాపూజీ గుర్తించి చాలకృషిచేసియున్నారు 'యంగ్ ఇండియా' అనే పత్రికలో అనేక వ్యాసములువ్రాసి సందేశములందజేసియున్నారు. "వరకట్నాలకు అమ్ముడుబోవు యువకులు తమ విద్యకును, దేశమునకును, స్త్రీజాతికిని ద్రోహముచేసిన వారగుదుర"ని నొక్కి వక్కాణించారు. మఱియు దేశములోగల యువజనోద్యమములన్నియు ఈదురాచార సమస్యాపరిష్కారమునకై యెంతైనా కృషిచెయ్యాలనే సందేశమునందజేసియున్నారు కాని అప్పటికిని - యిప్పటికిని మనలో ఈ సమస్య మార్పుజెంది మనకష్టములు కడతేరాయా?- అనేదిప్రశ్నగా నిలిచింది. ఈ ప్రశ్నకు సులభముగానే జావాబు లభిస్తుంది - ప్రస్తుతసమాజవాతావరణమును చర్చించుకుంటే, దురాచారముగా పరిణమించిన వరకట్నబాధల్ని గూర్చి అనేక పత్రికలలో వ్యాసాల, కథల రూపములలో చదువుతునేయున్నాం ప్రతీయింటా యీ బాధల్ని అనుభవిస్తూనేయున్నాం.

ఆదినుండియు భారతసాంప్రదాయములలో వివాహసంస్కారమునకు ఒక మహోత్కృష్టమైన విశిష్టత వుంది. వరుని శ్రీమహావిష్ణు స్వరూపునిగా భావించుట భారతీయుల సాంప్రదాయము అట్లుదైవస్వరూపునిగా భావింతురుగనుకనే పెద్దవాడైన మామగారు వరుని పాదప్రక్షాళనము చేయుటగలదు. దైవమునకు అన్ని సేవనములతోబాటు దక్షిణతాంబూలముల నిచ్చుట గూడ పరిపాటి. అట్లే దైవస్వరూపునిగాభావించిన వరునికిగూడ కన్యాదానముతోబాటు తోచిన దక్షిణలనిచ్చుట ఆచారము. దైవమునకిచ్చు దక్షిణ "యింత"యను నిర్ణయముండదు. వారివారిశక్తి వుత్సాహములనుబట్టి జరుగును. ఇది అనాది ప్రసిద్ధమైయున్న ఆచారము. అసలు ఆదిలో ఈ ఆచారము లన్నియు మనము నిర్ణయించుకొన్నవే. అదేమార్గము నందరు అనుసరించుచూ ఆచరించుచున్నారుగనుకనే ఆచారమయినది. అయినను యిదొకనాడు సదాచారమని అంగీకరించక తప్పదు. కాని కాలక్రమమున ఈ సదాచారము దురాచారమై అనేక అత్యాచారములకు

మార్గదర్శికయైనది. విష్ణు స్వరూపులుగా భావింపబడిన వరులు క్రమముగా తమ దైవత్వమును విడనాడి నిర్ణీతధరలకు అమ్ముడుబోవుచున్నారు. ఈ రీతిగా యువకులు వరకట్నమునకు అమ్ముడు పోయిన దోషము సంప్రాప్తించుటవల్ల ఇహపర సాధకమైన పితృకర్మాచరణకు అనర్హులగుచున్నారు. మఱియు తల్లిదండ్రులు నరమాంసవిక్రయదోషమును పొందుచూ కుమారులను అమ్మకొన్నందున పుత్రవిహీనులై పున్నామనరకమునకు బోవుటగూడ దాపురించుచున్నది. దయాదాక్షిణ్యములు లేకుండా వరకట్నాలు గుంజుకునే వారలంతా తమ సంతానము యొక్క రక్తమాంసములు నడిబజార్లలో వేలము వేయుచున్నారన్నమాట. కొంచెము లోతుగా ఆలోచించిన యెడల పశుప్రవృత్తికీ ఈ వేలము పాటలకు తేడా ఏమాత్రమూ లేదనుట ముమ్మాటికీ సత్యం.

నవనాగరికులమనుకునే అధికవిద్యావంతులు సహితము కట్నాల కెగబ్రాకుచున్నారంటే - నిజముగా విద్యార్థిలోకమునకే తీరని కళంకమనేది నిస్సందేహము. సమాజములో ఒక సమస్య దురాచారమైనప్పుడు - ఆ దురాచారమునరికట్టే బాధ్యత గల విజ్ఞానవంతులు గుర్తించక, ఆ దురాచారమునకే దాసులై దానినే అమితముగా ప్రోత్సహించుచున్నారంటే మనమెంతవరకు విజ్ఞానులమో - నాగరికులమో కాస్తఆలోచించండి. కొందరి తల్లిదండ్రులు తమ కుమారులకు చదువునిమిత్తము ఆదినుండి పెట్టిన పెట్టుబడి ధనమంతయు కట్నాల రూపములో - వర్తక సరళిగా-కన్యదాతలను రొక్కించి-నొక్కించి బాధించి వేదించి వసూలు చేయుచున్నారు. "మనవాడు ఇంతవరకు చదువుకున్నాడు - కనుక ఇంతకట్నం వసూలు చేయాలి" — అనుకుంటూ నిత్యమూ కలలు గంటూన్న తల్లిదండ్రులనేకముగా కనిపిస్తున్నారు. పైగా కొందఱు తమకుమారుల వుద్యోగబాధ్యతలు, పైచదువుల "సీటు" బాధ్యతలు మున్నగు షరతులు కూడ కన్యదాతలకు అప్పగిస్తున్నారంటే - తమ నిస్సహాయతను చాటుకోవడమే అవుతోంది. బిడ్డల చదువులకై చేసే అప్పులను తీర్చేందుకు కుమారులను వేలముపెట్టి ఆ బాధలనుండి తద్వారా విముక్తులవుతున్నారు. ఎవరికెక్కువగా కుమారులుంటే — వారినంత ఆస్థిపరులుగా లోకము పరిగణిస్తోంది. కుటుంబ గౌరవమర్యాదలకు పేరుప్రతిష్ఠలకు కొలమానికముగా వరకట్నాలను రూపొందించడం భావ్యమేనా?

యువకులు నవనాగరికత కలవాటుపడుతున్నారే గాని నవనాగరికతతోబాటు సంస్కృతిపరులు కాలేకపోతున్నారు. ప్రతివాడు నిత్యమూ సూటు వెయ్యాలని కాఫీలు సేవించాలని - వీరే నవనాగరికతాపరులని వెఱ్ఱిభ్రమలతో నిర్ణయించుకుంటున్నారు యువకులందరు కేవలం వుద్యోగములకొరకే చదువుతున్నారన్న విధముగానే నేడు తొంబదిపాళ్ళు కట్నాల కోసము చదువుతున్నారనడములో సందేహంలేదు. కాని తొంబదిపాళ్ళు కట్నాలు అత్తవారివద్ద ముక్కులు పిండో, చెవులు మెలిపెట్టో - ఏదో విధముగా వసూలు చేయగలుగుతున్నారుగాని వుద్యోగములు సంపాదించుకోవడము దుర్లభంగా నేవుంది కొందరు యువకులు కన్యాదాతలపై తమ పైచదువులకై ఆధారపడుతున్నారంటే - కన్యాదాతల సంతానపు భవిష్యత్తును, అభివృద్ధిని బలిగొంటున్నారని ఆలోచించలేరా? నిజం చెప్పాలంటే ప్రస్తుత యువకులంతా తమ విజ్ఞానమును బూడిదలోపోసిన పన్నీరులా చేస్తున్నారు క్షమించాలి. యువకుల్ని దుయ్యబట్టడమే అభిమతంకాదని మనవి యువకులంతా ఈ మార్గములోనే నడుస్తున్నారని చెప్పలేము. యువకులలోకూడ గొప్ప ఆదర్శభావాలు, సంఘ సంస్కరణాభిలాష - కలవారువున్నారు. ఈ మాదిరి యువకులంతా తమకు వీలయినంతగా అవినీతితో ప్రవర్తించే సోదరమానవుల మనస్సులను మార్చ ప్రయత్నించాలి. ఏదేని సంస్కరణ తీసుకొని రావలనంటే అది మానసిక ప్రవృత్తిలోనే తీసుకొని రావాలికదా! ఈ కాలములో కట్నాలు పుచ్చుకొని యువకుడు ఆదర్శముగా నిలబడ్డాడు అంటే అతడు నీచాతినీచమైనపని చేస్తున్నాడన్నమాట. ఈ మాదిరి యువకులకై అఱ్ఱులుచాచి, చేతికందనివారిని తరువాత దుయ్య

బడుతూ-"అతనికి ఆదినుంచి కట్నమిచ్చి మా అమ్మాయిని చేస్తామన్న పెద్ద మనిషి కరువైనందుననే ఈ మాదిరి ఆదర్శములోనికి మారాడు కాని ఈ రహస్యమెవరికి తెలియదు" - అంటూ దుష్ప్రచారముచేసే తల్లిదండ్రులుకూడ లేకపోలేదు తల్లిదండ్రుల నెదిరించి వరకట్న నిషేధమే నాఆదర్శమంటూ నిలబడిన యువకులను పితృవాక్యపరిపాలకుడు కాడని జమకడుతోంది ప్రజానీకము. ఏదిఏమైనను యువకులను తమ తల్లిదండ్రులు 'మార్కెట్'లోని వస్తువులుగా, సంతలోని పశువులుగా చలామణి చేయుచున్నందులకు సంప్రాప్తించే అగౌరవము, అపఖ్యాతి తమదేయని భావించి, సాంఘిక చైతన్యమునకు ప్రవర్తులగుట - వర్తమాన సుఖశాంతులాధారముగా భవిష్యత్తునొక ఉజ్వల సౌఖ్యరాశిగా చేయవలసియున్నది

కట్నమివ్వడములో ఒకముఖ్యోద్దేశంవుంది నూతన వధూవరుల భావిజీవితము నవ్యధామంగా వుండాలని మామగారు తన కూతురి సౌఖ్యము, అభివృద్ధికోరి ఇచ్చే కానుకనే కట్నమనేవారు రాను రాను ప్రజల నైతిక విలువలు క్షీణించి మానవత్వం అడుగంటి - ఆర్థికదుస్థితి అధికమవటం, వీటన్నింటి కారణాన ఎక్కడేవిధముగా డబ్బు దొరికితే అక్కడ రాబట్టుకోవడమే అలవాటుగా వస్తోంది. ఈ వరకట్న దురాచారము మన దేశములో ఆడపిల్లలను కన్నవారి ఇల్లూ, ఒళ్ళూ గుల్లచేస్తున్నది. ఈ ఆచారము ఏ ఒక్క కులానికో లేక వర్గానికో సంబంధించిన ఆచారము మాత్రమేకాదు - అన్ని కులాల్లోను, అన్ని వర్గాలలోను ఈ ఆచారమువున్నది. ఒక్క మన దేశములోవున్న విషయమేకూడకాదు. ఇంచుమించు ప్రతి దేశములోను ఈ దురాచారం ఏదో రూపములోవున్న విషయమే !

"ధర్మపత్ని, సహధర్మచారిణి, అర్థాంగి, గృహలక్ష్మి" - యంటూ హిందూపత్నిని పేర్కొనబడుచుండుటకు కారణము కర్మనిర్వహణమందును యిల్లాలు సహభాగినియై, సమాన బాధ్యత వహించుటయే నిర్దుష్టమైన క్రియా సఫలతకు, నిస్తులమైన భావశబలతో అవసరము. కావున భర్తతోపాటు భార్య సమానమైన వైదుష్యము కలిగియుండవలెను. ఇవి లేనప్పుడు భావసంఘర్షణ తలచూపును. ఈ స్థితిలో భార్యా భర్తలకు పరస్పరానురాగముకలిగి వారి జీవితనౌక సుఖశాంతులతో సాగేదెట్లు ? -

భారతదేశములోనే కాకుండా ఆంధ్ర ప్రదేశ్ లో కూడ స్త్రీలకంటె పురుషులే ఎక్కువమంది వున్నారు. అయినా మానసిక ప్రవృత్తిలో ప్రతివాడు కట్నము పుచ్చుకోవడము,ఇవ్వడమూ దురాచారముగానే పరిగణించి నిషేధించుట కష్టమైనా ఆడపిల్లల తల్లిదండ్రులు కలసి ఐకమత్యముతో ఏకాభిప్రాయముగా "మేము కట్నములేకుండా చేసుకొనేవారికే మా అమ్మాయినిస్తాము"నిచెప్పి నిలబడగలిగే ధైర్యము కలగాలి. ఇది అసంభవముగాను, హాస్యాస్పదముగాను కనిపిస్తుంది మనకు కాని ఇది మనకు అసంభవమా ! హాస్యాస్పదమా ? - లేక కట్నమిచ్చి కన్యాదానము చేయలేక మనోవ్యాధితో, ఆడపిల్లలను ఇంట్లో వుంచుకొని బాధపడడం సంభవమా ? - హాస్యాస్పదమా ? వివాహమనేది పురుషునకెంత యవసరమో స్త్రీకి కూడ అంతే యవసరము. స్త్రీల సంఖ్యకంటె పురుషుల సంఖ్య హెచ్చుకాబట్టి స్త్రీలందరకు వివాహం కావటము తథ్యం. కన్యలుకూడ పశువులవలె అమ్ముడుబోవు నైతిక బలహీనులను వివాహమాడమని అవసరమైన అజన్మాంతము బ్రహ్మచారిణులుగానైనా నుండిపోగలమనే ధైర్యస్థైర్యాలు, ఆత్మవిశ్వాసము యువతులలో యున్ననాడు ఈ దురాచార సమస్య చాలవరకు పరిష్కారము కాగలదు. సాంఘికానర్థకముగా పరిణమించిన వరకట్నాలను నిషేధించవలసిన యవసర విషయమై భిన్నాభిప్రాయములకు తావేలేదు. తల్లిదండ్రులు తమ కుమార్తెలను వివాహముచేయుటయందు ఆర్థిక మానసిక బాధలననుభవించడమేకాక ఆత్మహత్యలు చేసుకోవడము, మతి తప్పిపోవడము జరిగిన సంఘటనలుకూడ మనం నిత్యమూ చూస్తూనే యున్నాం - పత్రికలలో చదువుతూనే యున్నాం.

గ్రామాలలోని బీదకుటుంబీకులు కన్యాశుల్కము ఇచ్చుకునే దురాచారముకూడ ఇంకా మనలో అమలు వుంది. అయితే ఈ దురాచారముతో బాధపడేది బహు అరుదుగా కనిపిస్తున్నారు

స్త్రీ పురుషుల మధ్య చట్టరీత్యా ఎట్టి విచక్షణా చూపరాదని భారత రాజ్యాంగము నిర్దేశిస్తున్నది ఇటీవల ఆమోదింపబడిన హిందూవారసత్వ చట్టము ననుసరించి స్త్రీలకు పరిమితమైన ఆస్తి హక్కులు కల్పించబడినవి. చట్టరీత్యా సమానావకాశములు కల్గించడముతోపాటు బాలికలకు గ్రామాలలోను పట్టణాలలోను తగినంతగా విద్యావకాశములు ఏర్పరచిననాడు మహిళాభ్యుదయము సాధ్యముకాగలదు. వేలాది సంవత్సరములుగా సమాజములో మరుగునపడియున్న స్త్రీ జాతికి పురుషులతోపాటు సమాన హోదాను, స్థాయిని కల్గించాలంటే ఆర్థిక హక్కులతోపాటు సాధ్యమైనంత హెచ్చుగా విద్యావకాశములు ఏర్పరచడమెంతో అత్యవసరము. స్త్రీల పురోభివృద్ధికి ఎంతో అవరోధముగావున్న దురాచారములలో వరకట్నమొకటి ప్రధానస్థాన మాక్రమించినది. చదువుకున్న ఆడపిల్లలకుకూడ కట్నాలూ కానుకలూ లేకుండగ వివాహములు జరగడము దుర్లభమవుతున్నది. స్త్రీలుకూడ స్వయంపోషకులు కాగలిగిననాడు ఈ దురాచారములు మనలను బాధించవు. కుటుంబములు నాశనముచేసుకుని వివాహములు చేసుకొనుటకన్న ఆ డబ్బుతో విద్యావంతులై స్వయంపోషకులు గావడము అన్ని విధాల శ్రేయస్కరము. (ఆనాడు నిరుద్యోగ సమస్య మరింత బాధించదా ? - యనేది ప్రశ్నగా వస్తుంది.)

స్త్రీలలో నాలుగైదుగురు ఆడపిల్లలను కన్న తల్లులే కదా ! అయితే ఏంలాభం ? - తమ కొడుకుల పెళ్ళిళ్లకు రెండు చేతులా వరకట్నాలు గుంజుకొంటున్నారు. కుమార్తెల పెండ్లిళ్ళు వచ్చేసరికి కట్నాలివ్వలేమని అంగలారుస్తున్నారు. మన మనుభవించే బాధను ఎదుట మానవునకు కలుగజేయకూడదనే భావం, సహృదయము మనలకు కలగాలి. భార్యను పోషించే శక్తివుంటే పిల్లనిస్తామని కొందరు ; మా పిల్లను పని పాటలకు పంపకుండా కూలిమనిషిచేత పనులు చేయించుకునే సంబంధమే కావాలని కొందరు ; మా పిల్లను కారులో త్రిప్పుతూ సినిమాలు చూపించే అల్లుడు కావాలని మరికొందరు - ఈ విధముగా అందరూ తమ అల్లుడు డాక్టరో, కలక్టరో, లక్షాధికారో అయివుండాలనుకోవడంకంటె వేరొక అపచారముందా ? - ఈ వివాహములలో మరికొందరు స్త్రీలు - వియ్యపురాలి చీర చాల ఖరీదయినది కావాలని, సారె - చీరలు అమితముగా పెట్టాలని, బంగారు ఆభరణాలు చాల కావాలని - మొ॥ కోరికలెన్నో కోరడం అవివేకం. ఈ విధానాలవలన దేశ ఆర్థికవ్యవస్థకు లోటు కల్గిస్తున్న బంగారు ఆభరణాల రూపములో "డెడ్ కాపిటల్" పెరుగుతున్నదని గుర్తించాలి. అమితమైన ఆశలతో తగని సంబంధాలు కోరినప్పుడు కోరిన కట్నాలిచ్చుకో నక్కర్లేదా ? - యనే ప్రశ్నకు స్త్రీలు గురికారాదు.

తల్లిదండ్రులు కుమారుల్ని గారాబంగా పెంచి విద్యాబుద్ధులు చెప్పిస్తున్నప్పుడు వారిభవితవ్యాన్ని గురించి కలలు కనివుంటారు. తల్లిదండ్రులకందరికీ ఇది సర్వసామాన్యం. మావాడు గొప్పగా చదవాలి- నలుగురిలోను పేరు ప్రతిష్టలు కలిగి మెలగాలి అని వూహించివుంటారు. ఈ ఊహలు తల్లిదండ్రులకున్న పుత్ర వాత్సల్యాన్ని ప్రకటిస్తాయి. అయితే తల్లిదండ్రులు తమకు పేరుప్రతిష్టలు ఎట్లావస్తాయని అనుకొంటున్నారో వూహించడము కష్టముగా వుంది. వేలకువేలు వరకట్నాలులాగడముద్వారా అవి కలుగుతాయనుకుంటున్నారో ?! - లేక మరి ఒకరి సంసారములో చిచ్చుంటించి స్వీయసంసారాభివృద్ధి చేసుకోవడముద్వారా కలుగుతాయనుకుంటున్నారో ?- తమ కుమారుల భవిష్యజ్జీవితము సుఖముగా గడవాలనే అభిలాషతో పెళ్ళి సంబంధములో కొంత ఆర్జించాలనుకుంటున్నారు. ఈ విధమైన ధనార్జనతోనే వస్తున్నాయా పెద్దలకు పేరు ప్రతిష్టలూ, గౌరవమర్యాదలూను ! ఇదే నా న్యాయం ?

(సశేషము)

200_వ పేజి తరువాయి
నిష్కళంకంగా జీవించడానికి ఉపయోగ పడేశక్తి ప్రేమ. ప్రేమ ఎటువంటి మనిషి నైనా మార్చివేస్తుంది. మహనీయుల జీవిత చరితలను గుర్తుచేసే ఉత్సవాలను జరపడం వల్ల సత్యం ప్రేమ మనకు అలవడే అవకాశం ఉంటుంది.''

ఉపరాష్ట్రపతి డాక్టరు రాధాకృష్ణన్, మదరాసు గవర్నరు శ్రీ బిష్ణూరాంమేధీ, రక్షణశాఖ కార్యదర్శి శ్రీ ఓ. పుల్లారెడ్డి, మద్రాసు ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్, బొంబాయి గవర్నరు శ్రీ శ్రీప్రకాశ్ ప్రభృతులు సభకు శుభాకాంక్షలు పంపించారు.

డాక్టరు టి. ఎమ్. పి. మహాదేవన్ ఇలా చెప్పారు "ధర్మరక్షణార్థము ప్రతి యుగంలోనూ అవతార పురుషులు జన్మిస్తూంటారు. భగవంతుడు అవతారమెత్తుతున్నాడంటే ఈ ప్రపంచానికి ఆయనే రక్షకుడని అర్థం. ధర్మం ఉంటే ప్రపంచం అనేది ఉంటుంది. భౌతికశాస్త్ర సిద్ధాంతం గాని, కర్మసిద్ధాంతంగాని ఈ ప్రపంచాన్ని రక్షించవు. భక్తి ప్రపత్తి మాత్రమే ప్రపంచానికి అంగరక్ష. గీతా ప్రవచనాలలో ప్రధానమైనవాటిలో కర్మయోగము ఒకటి. ప్రపంచంలో వచ్చే వైపరీత్యాలకు మూనవుడు దాసుడై పోరాడన్నదే రామాయణం తాత్పర్యం. సీతారాముల జీవిత చరితలో త్యాగనిరతి మూర్తీభవించింది.''

మత ప్రాముఖ్యంలేని రాజ్యాంగాన్ని భారతదేశం అనుసరించడంద్వారా అన్ని మతాలకూ సమాన ప్రాముఖ్యం లభించిందనీ శ్రీ నీలంరాజు వెంకటశేషయ్యఅన్నారు. మతప్రాముఖ్యంలేనిరాజ్యాంగం అనే మాటను ఆస్కారముగా చేసుకుని మత వ్యతిరేక ప్రచారం, నిరశ్వర ప్రచారం, వంటివి చెయ్యరాదన్నారు.

జీవితంలోని కష్టాలను ఏ విధముగా ధైర్యంగా అధిగమించ గలిగినదీ శ్రీరాముని జీవితచరిత్ర విశదం చేస్తోందని శ్రీ కె. ఎస్. రామస్వామిశాస్త్రి అన్నారు.

ఏ రూపంలో భగవంతుణ్ణి అర్థించినా అందరూ ఆయన సన్నిధికి వెళ్తారని శ్రీ ఎస్. సుబ్రహ్మణ్యం అన్నారు.

దేవాలయాలకు వెళ్ళి పూజలుచేస్తేనే భక్తి అలవడుతుందని అనుకోరాదని శ్రీమతి లలితాబాయి అన్నారు. వాస్తవమైన హృదయపరివర్తన తోటిమానవులంటే ప్రేమ భక్తికి నిజమయిన బాట లన్నారు.

అంతకు కిందటి రోజున ఆ ఉత్సవాల సందర్భంలో రెండువేల మందికి అన్నదానం చేశారు.

176 వ పేజి తరువాయి

లెఖ్ఖలు వేయటంలోకన్నా, వ్యాకరణాన్ని బట్టి పెట్టటంలోకన్నా అప్పటినుంచీ నాకు ఎప్పుడు తీరికదొరికినా బొమ్మలని గీయటంలో నా తెలివి తేటలను, వుత్సాహాన్ని చూపెడుతూవుండేవాణ్ణి ... ....

పెద్దవాళ్లు ఇచ్చె సలహాలన్నీ యధాతధంగా పిల్లల అభివృద్ధికోసమే అయినా వాళ్లు అస్తమానమూ చూస్తూ వుండే ప్రపంచం, ఆ ప్రపంచంలో వాళ్లు నిమిష నిమిషమూ ఎదుర్కొంటూవుండే సమస్యలు, అలాటి సమస్యలను తేల్చటానికి అవలంబిస్తూవుండే పద్ధతులువేరు. పిల్లల లోకం వేరు. ఆ లోకాన్ని అర్ధంచేసుకోటానికి పిల్లల్లో రేకెత్తుతూవుండే వూహలు, ఆలోచనలు వగైరాలు వేరు. పెద్దవాళ్లకి ఇలాటి పిల్లల మనోభావాలు ఎలా అర్ధమవుతాయి? అంతేనా! అలా అర్ధం చేసుకోటానికి ముందంజ వేయటానికి వాళ్లకు ధైర్యము, సాహసం అనేవి వుండాలిగా! . దీనికంతా కారణం పెద్దలు వాళ్లు అనుకుండేవి నిజమని అనుకుంటారు. అలాటి భావాలకి వ్యతిరేకంగా పిల్లలు ఏమైనా అన్నారా, ఇంకేంవుంది - కొంప భగ్గున పోతుందనే అనాలి. చెడమడా పిల్లలను తిడుతారు. చదువు సంధ్యలని వదిలేసి ఇలాటి వెర్రి వెర్రి వూహా ప్రపంచంలోకి దిగటానికి ప్రారంభించారా వాళ్ల భవిష్యత్తే మన్నుపాలైపోతుందని పిల్లల మీద మండిపడిపోతారు . ... ఇది పెద్దల స్వభావం. వాళ్ల తత్వంకూడా ఈ పంధాలోనే నడుస్తూవుంటుంది. అలాటి దాన్ని మార్చటానికి ఎవళ్లతరమవుతుంది? ... ... పిల్లలు పెద్దవాళ్లకన్నా తెలివితేటల్లో, అనుభవంలో, వూహల్లో గొప్పవాళ్లని అనటంలేదు. కాని వాళ్లు, వాళ్ల ప్రపంచాన్ని అర్ధంచేసుకోటానికి అవలంబించే పద్ధతులు ఒక ఎత్తు. పెద్దవాళ్లవి ఒక ఎత్తు. పిల్లలక, వాళ్ల వాళ్ల మనోభావాల కనుగుణ్యంగా బొమ్మలని వేయాలని, కధలని రాయాలని పద్యాలని అల్లాలని చెప్పరానంత వుత్సాహం. ఆ పని పాటలకోసం వాళ్లు అస్తమానమూ చూపెడుతూవుండే ఆతృత ఆవేశం, ఇక మాటలతో చెప్పాలా! అలాటి పనిపాటలను సాధించటం ఆ వయస్సులో పిల్లలకు చెప్పరానంత కష్టం. ... అలాటి కష్టపరంపరలను నేనూ నా బాల్యంలో ఎదుర్కొంటూవుండేవాణ్ణి. కాని పిల్లలు, తాము పట్టిన పట్టును విడువకుండా, దానిని సాధించటానికి అస్తమానమూ శ్రద్ధ చూపెడుతూ వుండగలిగారా - అలా శ్రద్ధా భక్తులను చూపెడటం పిల్లలకు పెట్టింది పేరుకదూ! - వాళ్లు పట్టినపట్టు నెరవేరుతుంది. వాళ్లు గీసే బొమ్మలు, రాసే రచనలు ఎంతో అమూల్య రత్నాలవుతాయికూడా! ...

2

నా స్కూలు చదువు ముగిసింది. కాలేజి చదువూ పూర్తిగా ముగిసింది. ఇంక ఏం చెయ్యాలి అనే గడ్డు సమస్య నన్ను పీల్చి పిప్పిచేయటానికి ప్రారంభించింది. నేను పుట్టింది, పెరిగింది పల్లెటూరు. చదువు సంధ్యలకోసం నా విద్యార్థి జీవితాన్నంతా యథాతథంగా గడిపింది పట్నవాసం ... మా వాళ్ళు నన్ను మా వూళ్ళోనే వుండిపోయి, మా ఇంటి పనిపాటలని చూసుకుంటూ వుంటే అన్ని విధాలా బాగుంటుందని సలహాల నీయటానికి మొదలెట్టారు. పట్టపరీక్షల్లో ఆరితేరి ఇంటిలో అడుగుబెట్టినప్పటినుంచీ వంశ పారంపర్యంగా వచ్చే మా వాళ్ల వృత్తుల్లో ప్రవేశించటం ససేమిరా నాకు నచ్చింది కాదు. .. ...

అదేం మాయోగాని, బాల్యంనుంచి నేను చదవటానికి ప్రారంభించిన కథలూ, గాథల మూలంగానైతేనేం, వాటిని చదవటం మూలాననైతేనేం, నా బుర్రలో తడుతూవున్న వూహాల కనుగుణ్యంగా రకరకాల చిత్రాలను వేస్తూ వుండటం మూలాననైతేనేం, నిలకడగా ఒక చోట వుండిపోయి, నాకు నచ్చిన పనిపాటలను చేయ నారంభించటానికి ముందు ఒక సారి ప్రపంచాన్నంతా చుట్టిరావాలనే ఆశాభావం బుర్రలో తట్టింది. ... ప్రపంచాన్ని ఆపళాన చుట్టి రావటం అంటే సులభ సాధ్యమైనపనా మరి? బోలెడంత డబ్బు కావాలి. ఇంకా ఎంతెంతో అంతూ పంతూలేని తంతుకూడా వుండాలి. అంత స్తోమత మాకు వుంటేగా! అంచేత నా ఆలోచనని ఆచరణలో పెట్టటానికి "పైలెట్" శిక్షణని పొందటం అన్ని విధాలా సర్వోత్తమమని అనుకున్నాను. ఇలాటి ఆలోచనలు, ఇంతకుముందు నేను అన్నట్లు, నా బుర్రలో తట్టాయి, వాటిని తటపటాయించకుండా కార్య రూపంలో బెట్టేనంతవరకు వూరుకుండే ఘటమైతేగా నాది! మా వాళ్లకి నా ప్లాను తెలిసింది. అలా "పైలెట్"గా పనిచేయటం మా వంశమర్యాదకే తప్పని, ఆ దోవనుంచి తప్పించటానికి ఎన్నెన్నో ప్లానను వేసినా — వాటిని ప్రతిఘటిస్తూ మా దేశంలోనే పేరు ప్రఖ్యాతులు గాంచిన విమానాశ్రమ విద్యాలయంలో "పైలెట్" ట్రెయినింగ్ కోసం ప్రవేశించాను. విద్యాలయంవారు ఇచ్చిన ట్రెయినింగ్‌లో శ్రద్ధాభక్తులను చూపెడుతూ, ఆ శిక్షణను క్షుణ్ణంగా సంపాదించాను. . ...

ఈ ట్రెయినింగ్‌లో ఆరితేరిన తరువాత, మరి కొంతకాలం వాళ్ల అదుపాజ్ఞల్లోనే వుండటం అవసరం. ఆ కాలంలో రకరకాల వాయు విమానాలను అన్ని రకాల వాతావరణాలలో నడుపుతూ దేశదేశా

లని చుట్టిరావలసి వస్తుంది ... అలా దేశదేశాలని చూస్తూ వస్తూవున్న కాలంలో ఆయా దేశాలని, భూగోళపరిస్థితులను, దేశ చరిత్రలను, ముఖ్యంగా ఆయా దేశాల ఆచార వ్యవహారాలు వగైరాలను చక్కగా అవగాహనం చేసుకోటానికి మంచి అవకాశం లభించింది. అంతేనా మరి? ఖగోళ శాస్త్రాన్నికూడా క్షుణ్ణంగా తెలుసుకోటం ఈ సందర్భాన తప్పనిసరి అయిపోయింది. ... ...

రాత్రిపూట ప్రయాణం చేస్తూవున్నా, పగటిపూట వెడుతూవున్నా, ఆకాశమండలంలో ఎంత ఎత్తులోకి ఏరోప్లేనుని నడుపుతూవున్నా క్రింద కనబడేది ఫలానా ప్రాంతమనీ, ఈ ప్రాంతం నేను చేరుకోవాలసిన చోటికి ఎంత దూరంవుందో, ఇక్కడి వాతావరణ పరిస్థితులకు, అక్కడి ప్రకృతి పరిస్థితులకీ వుండే తారతమ్యం ఎటువంటిదో, పుస్తకాలను పారచూడకుండా, అప్పటికి అప్పుడే అవగాహనం చేసుకోటం ఇలాటి పనిపాటల్లో అత్యవసరమైన ఘట్టం. కొంత అనుభవాన్ని సంపాదించామా, ఇలాటి వివరాలు అర్థంచేసుకోటం ఒక బ్రహ్మవిద్యకూడాకాదు! ... ...

ఇలాటి యాత్రలను ఎన్నెన్నో ఈ కాలంలో చేయాలసివచ్చింది. ఎన్నెన్ని సంగతులని తెలుసుకునే భాగ్యం లభించిందో వివరంగా వ్రాయటం అనవసరమని అనుకుంటాను. ఇండ్లల్లో, స్కూళ్లల్లో కాలేజీల్లో సేకరించిన అనుభవాలు ఒక ఎత్తు. .. ఇతర వాతావరణాలని ఎదుర్కుంటూవున్న సమయాల్లో, అలాటి సంఘటనలలో మనం కలుసుకుండే పెద్దా, చిన్నలనుండి ఎన్నెన్నో అత్యద్భుతమైన సంగతులను తెలుసుకునే అదృష్టభాగ్యం కూడా లభిస్తుంది. ... ఈ అవకాశాలనే పూతగా నుంచుకుని, ఏ దేశానికి వెళ్ళటం తటస్థించినా, ఎవళ్లని కలుసుకోటానికి అవకాశం దొరికినా నేను చిన్నప్పుడు గీసిన బొమ్మలని వాళ్లకి చూపెడుతూ అవేమో చెప్పమని ప్రశ్నిస్తూ వుండేవాణ్ణి. నా పరీక్షకి గురిఅయినవాళ్లు పెద్దవాళ్లే. వాళ్లు ఆ బొమ్మలను తదేక దృష్టితోచూస్తూ, ఇస్తూవుండే జవాబులు, తూ.చా. తప్పకుండా మూ వాళ్లు నా చిన్ననాటి రోజుల్లో వాటికిమల్లే వుండేవి.... అంచేత పరాయి వాళ్లతో పేచీలు పెట్టుకోటమెందుకని ఆ బొమ్మల రహస్యమేమిటో వాళ్లకు తెలిపేవాణ్ణికాదు. దానికి బదులుగా వాతావరణాన్ని గురించీ, అన్నపానాదులని గురించీ, ఆటపాటలని గురించీ, రాజకీయాలని గురించి వాళ్లతో కబుర్లు చెప్పకుంటూ వుండటం నాకు పరిపాటి అయిపోయింది. అలాటి సమస్యలని వినటంలో, వాళ్లంతా చూపెడుతూవుండే వుత్సాహం,

శ్రద్ధ, ఓపిక, ఆవేశం, ఇంతింతని కూడా! వాళ్లంతా పుట్టింది 'దీనికోసమే. చెప్పాలా! ఇలాటి విషయాలను వినటంలో ఆ వ్యామోహంలో అంతా మరిచిపోతా చర్చించటంలో లోకం చూపెట్టే వ్యామో రనే సంగతి ఇక ప్రస్తావించటంకూడా హం మాటలతో చెప్పటం అనవసరం ఆవసరంలేదుకదూ!

... ——...

# పాకకళ

## ఉల్లిపాయలసూపు

కప్పుగిన్నెడు సన్నగాతరిగిన ఉల్లిపాయలముక్కలను రెండుచంచాల నూనెవేసి దోరగావాడ్చవలెను దానిలో కావలసినంత ఉప్పు, రెండుకప్పులనీరు కలిపి ఒక గంటసేపు ఉడుకబెట్టవలెను. తర్వాత కోసి యుంచుకొనిన రొట్టె తుంపులు రెంటిని అందులోవేసి, పైన చంచాతో బాగాకలిపియుంచుకొనిన జున్నును దానిపై చల్లి, 15 నిముషములు పొయ్యిమీదనుంచి వాడవచ్చును.

## చిక్కుడుగింజలు

నాలుగుకప్పుల ఎండు చిక్కుడు గింజలను ఒకరాత్రిఅంతా చన్నీటిలో నాననిచ్చి మరునాడుదయము ఉప్పువేసి మెత్తగా ఉడకబెట్టవలెను. మెత్తగా ఉడికినగింజలను నీరువంచేసి ఒకబాణలిలో క్రుమ్మరించి దానిలో 3 టేబిలు స్పూనుల బెల్లము పాకము (చిక్కనిది) కలిపి, సన్ననిమంటతో కలుపుతూ 15 నిముషములు పొయిమీదనుంచి వాడవలెను.

## బియ్యంగంజి

రెండుటేబిలు స్పూనుల బియ్యమును బాగుగా కడిగి అరగంటసేపు నానబెట్టవలెను. తర్వాత ఆ బియ్యమును 3 కప్పుల చన్నీటిలోపోసి క్రమముగా ఉడుకుపట్టునట్లు చేయవలెను. బియ్యం ఉడికి అన్నము కాగానే, కావలసినంత ఉప్పుకలిపి పొయిమీదనుండి దింపవలెను. గంజి చాల చిక్కగానున్నచో వేడినీళ్లు పోసి తగుమాత్రంగా పలుచనచేసికొనవచ్చును. దానితో పాలుకాని మీగడకాని, కలిపి సేవించనగును. లేదా చిక్కని మజ్జిగను కలిపిగ్లూకోసును భుజించవచ్చును.

చివుకుల లక్ష్మీ పున్నయ్య






ప్రశ్నోత్తర – మణిరత్నమాల అనువాదం : శుద్ధచైతన్య స్వామి. ప్రకాశకులు శ్రీ నారాయణమూర్తి, చైతన్యపాఠశాల, ఆళ్లగడ్డ, కర్నూలు జిల్లా. వెల 1 అణా.

శ్రీ ఆదిశంకరులు రచించిన మూలము తెలుగులోకి ఆంధ్రీకరించబడినది ఇందులోగల నూరుప్రశ్నలకుగల ప్రత్యుత్తరములు సకల శాస్త్రములను పరిచయము చేయునట్టివిగానున్నవి. సంఘములో మానవ జీవితములోని అవకతవకలను చిత్రించి మానవునకు ముక్తిమార్గమును యీ చిన్న పుస్తకము ప్రబోధించుచున్నది

నృత్యభారతి శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, గు. రుతీనగర్ విజయవాడ వెల రు. 1/–.

త్యాగయ్య, క్షేత్రయ్యలాంటి మహనీయుల సాహిత్యరచనల నాధారంగాగొని గ్రంథకర్తయీ ఖండ కావ్యం రూపొందించాడు.

పండిత, కళాకారులచే ప్రశంసించబడిన యీరచన బహుచక్కగాను, మనోజ్ఞంగానున్నది

వేంగీ చాళుక్యరాజుల చరిత్ర శ్రీ కొత్త బాపనయ్యచౌదరి, సంగం జాగర్లమూడి, గుంటూరు జిల్లా వెల 0–8–0.

వేంగి చాళుక్య రాజులు విశేషపరాక్రమవంతులే కాక వారి పాలనలో రాజ్యము సుభిక్షమై శాంతి సౌభాగ్యనిలయముగానుండెను. అట్టి పరిపాలనా విభవాన్ని. రాజుల పరాక్రమ సౌశీల్యాలను చరిత్ర ప్రసిద్ధముగా వ్రాసిన యీ చిన్న పుస్తకము బాగున్నది కవిత్వము సైతము ఉత్తమస్థాయిలో రసవంతముగా సాగినది.

జ్ఞానవాశిష్ఠరత్నములు . మహాకవి కిరికెర భీమరాయ గౌతమ. ప్రకాశకులు · శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల 12/433 నింకంపల్లిరోడ్డు, హిందూపురము, అనంతపురంజిల్లా. వెల రు. 1–4–0.

శ్రీరామచంద్రుడు తన గురువగు వశిష్ఠునివలన పొందిన యాధ్యాత్మిక జ్ఞానబోధయే యిందలి వస్తువు. మూలములోని దురవగాహనములగు అనేక విషయములను సరళమైన శైలిలో పాఠకుల కందింపజాలిన ప్రయత్నము మెచ్చుకోతగినది. ఆధ్యాత్మిక చింతను పామరులలో ప్రోత్సహించు నీ గ్రంథము ప్రచారములోనుండతగినది.

# శ్రీ విళంబినామ సంllర చైత్ర, వైశాఖమాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | బు | త్ర 54-15 పూభా 24-50 వరాహజయంతి |
| | 17 | గు | చ 59-34 ఉభా 31-18 త్యాజ్యాభావః మాసశివరాత్రి |
| | 18 | శు | ● అమా 60-0 రేవ 38-16 |
| | 19 | శ | అమా 4-37 అశ్వ 44-25 సూర్యగ్రహణం |
| | | | **వైశాఖమాసము** |
| 1958 సంll ఏప్రిల్ నెల | 20 | ఆ | శుపా 9-30 భ 14-0 |
| | 21 | సో | వి 12-41 కృ 54-11 |
| | 22 | మం | త 15-16 రో 57-44 బలరామజయంతి |
| | 23 | బు | చవి 16-32 మృ 58-55 |
| | 24 | గు | పం 16-37 ఆర్ద్రా 60-0 శంకరజయంతి |
| | 25 | శు | ష 15-12 ఆర్ద్రా 0-7 |
| | 26 | శ | స 13 13 పున 0-4 పుష్య 58-58 |
| | 27 | ఆ | అ 9-26 ఆశ్రే 56-15 |
| | 28 | సో | న 5-0 మఖ 53-26 శ్రీవైష్ణవ రామజయంతి |
| | 29 | మం | ద 0-4 ఏవ్యం 54-35 పూఫ 49-24 |
| | 30 | బు | ద్వా 48-32 ఉఫ 45-35 |
| | 1 | గు | త్ర 42-10 హస్త 41-12 |
| | 2 | శు | చ 36-8 చిత్త 37-4 నృసింహజయంతి |
| | 3 | శ | ○ పౌ 30-19 స్వా 33-13 |
| | 4 | ఆ | కృపా 25-4 వి 29-53 |
| | 5 | సో | విది 20 28 అనూ 27-14 తిథిద్వయం |
| 1958 సంll మే నెల | 6 | మం | త 16-37 జ్యే 25-20 |
| | 7 | బు | చవి 13 41 మూల 24-27 |
| | 8 | గు | పం 11 28 పూషా 24-42 |
| | 9 | శు | ష 11-24 ఉషా 26-52 |
| | 10 | శ | స 12-52 శ్ర 24-46 |
| | 11 | ఆ | అ 14-58 ధని 32 50 |
| | 12 | సో | న 17-27 శత 37-43 |
| | 13 | మం | దశ 21-0 పూభా 43-12 త్యాజ్యాభావః |
| | 14 | బు | ఏకా 26-24 ఉభా 49-57 |
| | 15 | గు | ద్వాద 31-27 రే 56-33 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor · C. C. Punniah.